# ఉత్తరరామాయణము

## (మొదటి భాగము)


అనుసరణ:

తర్కాచార్య, భాషాప్రవీణ

కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి






ప్రకాశకులు:

ఉమా పబ్లిషర్సు,

విజయవాడ - 1.

# పరిచయము

శ్రీ మద్వాల్మీకి సంస్కృతమున రచించిన రామాయణములోని ఉత్తరకాండను కంకంటి పాపరాజు ప్రబంధముగా 'ఉత్తరరామాయణ' మనుపేర తెనిగించెను. అతడు పదునెనిమిదవ శతాబ్ది మధ్యకాలమువాడు. నెల్లూరిమండల వాస్తవ్యుడు. తాను తరించుటకై శ్రీరామకథా విలసితమ్ముగ నీ కావ్యమును రచించెను. తన యిష్టదైవమ్మగు మదనగోపాలస్వామి కంకితమిచ్చెను.

ఇది సులలిత పదగుంభనలతో నెన్నిసారులు చదివినను తనివితీరదు. అతని కవిత్వము సర్వప్రసాద లబ్ధమున్నట్లు చదువగానే గోచరించును. భక్తి ప్రతిపద్యమందును స్ఫురించును. ఇందలి కథలు రావణకుంభకర్ణాదుల జీవితములను వ్యక్తము చేయుచు మనోహరముగా నుండును. ఇట్టి యుద్గ్రంథమును ప్రకాశకుల ప్రోత్సాహముపై బాలుర కందుబాటులో నుండునట్లు వచన రచన చేసితిని. విద్యార్థులు దీని జదివి ప్రబంధమును జదువ నుత్సహింతురు గాక! నా కృషికి భాషాభిమానులు తోడ్పడుదురు గాక యని ప్రార్థించుచున్నాను.

శా. శ. 1879 జ్యేష్ఠము 30
విజయవాడ – 2

ఇట్లు,
రచయిత.

# విషయసూచిక

# ఉత్తర రామాయణము

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః

## రామాయణ కథాసంగ్రహము

సరయూనదియొడ్డున సాకేతపట్టణము కలదు. అది ఉత్తరకోసల దేశములకు రాజధాని. సూర్యవంశపురాజులు, ఇక్ష్వాకు మొదలైనవారు దాని నేలుచుండిరి. అందు దశరథుడను రాజుకలడు. అతనికి 'కౌసల్య, కైక, సుమిత్ర' అని ముగ్గురు భార్యలు కలరు. అరువదివేల సంవత్సరములవరకు నతనికి సంతానము కల్గలేదు. చివరికి ఋష్యశృంగుని యాధ్వర్యమున పుత్రకామేష్టిచేయగా కౌసల్యకు శ్రీరాముడును, కైకకు భరతుడును, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులును పుట్టిరి. వారికి వసిష్ఠమహర్షి చే సకలవిద్యలు నేర్పించెను.

అంత విశ్వామిత్రుడు యాగరక్షణకై శ్రీరామలక్ష్మణుల దీసికొనివెళ్ళి వారికి 'బల - అతిబల' అను మహామంత్రములను ధనుర్బాణములను ఇచ్చెను దారిలో 'తాటక' అను రాక్షసిని చంపెను. యజ్ఞమును పాడుచేయుచున్న మారీచ సుబాహులను కొట్టగా సుబాహుడు చచ్చెను. మారీచు డెక్కడో సముద్రములో పడి చావు తప్పి బ్రతికి బయటపడెను. తరువాత విశ్వామిత్రుడు వారిని మిథిలకు తీసికొని వెళ్ళుచుండగా దారిలో రామపాదధూళిసోకి రాయిగా

నున్న అహల్య శాపవిముక్తి నందినది. మిథిలకేగి శివునివిల్లు విరచి సీతను పెండ్లాడెను. లక్ష్మణ భరతశత్రుఘ్నులు ఊర్మిళా మాండవీ శ్రుతకీర్తులను పెండ్లాడిరి. ఇంటికివచ్చు దారిలో పరశురాముని నిర్జించి రాముడు అతనివద్దనున్న విష్ణుధనువును గ్రహించెను. పట్టాభిషేక సంభారములు జరుగుచుండగా కైక కోరికపై సీతారామలక్ష్మణులు పదునాలుగేండ్లు వనవాసమున కేగిరి. ఈ లోపున దశరథుడు చనిపోగా భరతుడు శ్రీరాముని రాజ్యముసేయుమని ప్రార్థించెను; కాని రాముడందుల కంగీకరింపక తన పాదుకలనిచ్చెను. అవి తీసికొని భరతు డయోధ్యకు దగ్గరగా నున్న నందిగ్రామములో నివసించుచు రాజ్యమేలెను.

దండకారణ్యమున నున్న రాముని, లక్ష్మణుని మోసగించి మారీచుడు బంగారులేడియై దూరము తీసికొనిపోగా రావణుడు సన్యాసిరూపమున వచ్చి సీతనెత్తుకొనిపోయెను. దారిలో జటాయువను గ్రద్ద అడ్డురాగా రావణు డతనని చంపివేసెను. సీతకై వెదకుచు రామలక్ష్మణులు జటాయువు వలన జరిగిన సంగతి నెరిగి సుగ్రీవునితో సఖ్యముచేసికొని, వాలిని చంపి కిష్కింధారాజ్య మతని కిచ్చి హనుమంతుని లంకకంపెను. అతడు వెళ్ళిచూచి రమ్మన్న కాల్చివచ్చినాడు. వానరసైన్యముతో లంక కేగి రామలక్ష్మణులు రాక్షసుల నందరిని ఊచముట్టుగా చంపివేసిరి. రావణ కుంభకర్ణులు యుద్ధమున చచ్చిరి. ఇంద్రజిత్తు, జిత్తులమారి. రావణుని పెద్దకొడుకు. లక్ష్మణుని చేతిలో చచ్చెను. రాముని శరణు వేడిన విభీషణుని రక్షించి,

లంకరాజ్యమున కతని రాజుగా చేసెను. అగ్నిపరీక్షచేసి సీతను పుష్పకవిమానముపై అయోధ్యకు తీసికొనివచ్చెను. నంది గ్రామములో నున్న భరతునికి హనుమంతునిద్వారా కబురంపి అందరును కలిసి పదునాలుగేండ్ల తర్వాత పురప్రవేశముచేసిరి.

ఆ రోజున ప్రజల యుత్సాహమున కంతులేదు. అందరును పరమానందభరితులైయున్నారు. ఎప్పుడో జరుగవలసిన శ్రీరామపట్టాభిషేక మిప్పుడు జరిగితీరును. నగరమంతయు అలంకరింపబడినది. వసిష్ఠాది మునులు సకల నదులనుండి కొని తేబడిన పవిత్రోదకముతో శ్రీరామపట్టాభిషేకము చేసినారు. శ్రీరాముడు పట్టాభిషిక్తుడై పట్టాభిరాముడైనాడు. ప్రజల కోరికలు నెరవేరినవి. అందరును సంతోషప్రవాహమున తేలి యాడుచున్నారు. సుభిక్షముగా సర్వసస్యఫలసమృద్ధి కలిగి భూమి బంగారు పండుచున్నది. ఆవులు పుష్కలముగా పాలు యిచ్చుచున్నవి. నెలకు మూడువానలు కురియుచున్నవి. అగ్నిచోరాదీతిబాధలు లేవు. ప్రజలు సుఖపడుచుండిరి.

ఒకనాడు శ్రీరాముడు, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు' హనుమ, సుగ్రీవ, అంగద, నల, నీల, జాంబవ విభీషణులు నలువంకల సేవించుచుండ సీతాసమేతుడై భద్రాసనము నధిష్ఠించియుండెను. మంత్రులు, సామంతులు సభ నిండియుండిరి. అంత కణ్వ, గాలవ, గార్గ్యాది మహర్షులు పెక్కుమంది శిష్య సమేతులై రాక్షససంహారము చేసివచ్చిన రఘువీరుని చూచి కీర్తించెడి కోరికతో వచ్చిరి. వారు ద్వారములోనికి రాగానే ద్వారపాలకులు లోనికేగి శ్రీరామున కావార్త చెప్పిరి.

వెంటనే అతడు మిక్కిలి వేడుకతో మణిమయమైన బంగారు సింహాసనము దిగి, వారి కెదురువచ్చి, నమస్కరించి లోనికి తీసికొనివెళ్ళి కృష్ణాజినములు పరచిన కనకాసనము లపై కూర్చుండ బెట్టెను. వారి కర్ఘ్యపాద్యాది సత్కారములు నిర్వర్తించి, 'మహాత్ములారా! మీకు మీ శిష్యకోటికి కుశలమే కదా? మీ తపస్సు నిర్విఘ్నముగా కొనసాగుచున్నదా? మీ దీవనలవలననే మాకు రాజ్యపాలనము సక్రమముగ కొనసాగును. మీ మాటకు మూడులోకముల అడ్డులేదే? మీరు నిత్యసంతుష్టులు! అని గంభీరముగా పలుకుటతో అగస్త్యాది మహాత్ములు 'శ్రీరామచంద్రా! సూర్యుడు పద్మమును వికసింప చేసియున్నట్లు అందరి మనస్సులకు ఆనందము కల్గునట్లు నీవు రాజ్యము చేయుచుండగా మా కుశలము మాట వేరే అడుగ వలయునా? ఇంద్రునికి ప్రక్కలోని బల్లెమైన రావణుడు చని పోవుటతో మూలమూలలదాగిన దిక్పాలకులందరు వినువీధికి వచ్చినారు. సర్వరాజులు పడగలెత్తి తిరుగుచున్నారు. నేమందరమును నిర్భయముగా యజ్ఞములు చేసికొనుచున్నాము. రావణ కుంభకర్ణాది రాక్షసు లొకయెత్తు; ఇంద్రజిత్తు ఒక్కడు ఒకయెత్తు. అతనిని లక్ష్మణుడు వధిమాస్పుటతో లోకములు శాంతిపొందినవి! అని కీర్తించెను. అది విని రాముడు; 'మును లారా! ఘోరరాక్షసులెందరో యుండ ఇంద్రజిత్తు ప్రతాపమునే యెంచెదరేల. అతడంత మహిమకలవాడా? అత డింద్రుని నెట్లు గెల్చెను. అతని తండ్రియైన రావణాసురుని జన్మక్రమ మెట్టిదని యడిగెను.

# విశ్రవసుని జననము

అగస్త్యమహర్షి శ్రీరామునికి రావణ జననవృత్తాంతము నిట్లు చెప్పెను: కృతయుగమున బ్రహ్మకు కొడుకైన పులస్త్య బ్రహ్మ మహర్షిశ్రేష్ఠుడై యుండువాడు. ఆ మునిచక్రవర్తి మేరు పర్వతప్రాంతమందున్న తృణబిందుని యాశ్రమమున కరిగి తపస్సు చేయుచుండెను. అచ్చటికి విహారార్థమై దేవ, నాగ, గంధర్వ, విద్యాధరకన్యలు వచ్చుచుండువారు. ఈ మహర్షి యెదుటనే వారు వయ్యారముగా సయ్యాటలాడుచు, తియ్యని పలుకులతో చిలుకలననుకరించు కోయిలకూతలకూయుచు విహరించువారు. చెయ్యెత్తు తీగలను మెల్లగా అందుకొని వంచి పూలుకోయువారు, వారి ఆటలు పాటలు అతనికి కర్ణకఠోరములైనవి. చివరికి దుర్భరమైనవి. అతడుగ్రుడై 'నన్ను చూచిన కన్యక చూలాలగును' అని శపించెను. దేవతాస్త్రీలకు గర్భమన్న అమితమైన భయము. వారు భోగలాలసులు. గర్భము వచ్చుటతో నిండు యౌవనముపోయి పండు ముదుసలులగుదురు. అది గుర్తించియే మునియట్లు శపించినారు. దానితో వారు మునినీడనైన చూడకుండ పరుగు పరుగున పోవుచు తమలో యెవరికిని అర్భపుచిన్నెలు లేవుకదా అని దారిలో యొకరినొకరు సవిమర్శ చూచుకొనుచు యిండ్లకేగిరి.

అంత నొకనాడు తృణబిందు మహర్షికూతురు ముని వాక్యము నెరుగక ఆ వనములో విహరించుచు మునియెదుటికి వెళ్ళినది. అంతలో నామె చూలాలైనది. ఆమె చాల విచారముతో కారణము తెలియక 'ఇది నేనువచ్చిన వేళావిశేషము.

ఏ పుణ్యము పాపము ఎఱుగని నాకిది వచ్చి చుట్టుకున్నది. నలుగురును చూచిన నవ్వుదురు. పురమునకూ అప్రతిష్ఠవచ్చును. నేనపనిందల పాలగుదును' అని విచారించినది. ఆమె విచారమరణ్యారోదనమైనది. ఆమె చెప్ప దాచుద మనుకున్నను, కడుపు దాగునా? అట్లే మెల్లగా తండ్రివద్దకు వెళ్ళినది. అతడామెను చూచి, చింతాక్రాంతుడై, 'ఎక్కడికి వెళ్ళితివి? ఎవరైనను శపించినారా? ఇంతలో ఈ గర్భమెట్లువచ్చినది? పురమున కపకీర్తివచ్చును. తల్లిదండ్రుల కపఖ్యాతివచ్చును. నిన్నెవ్వరును లెక్కచేయరు, ఇట్లే కన్నెరికమున గర్భవతివై నాకు తలవంపులు తెచ్చినావు. దీనికి కారణమును వివరింపుము' అని తర్జించెను.

అంతనామె 'తండ్రీ! నే నే పుణ్యాపాపము లెఱుగను. పులస్త్యాశ్రమ భూమికి వెళ్ళి చెలులతోగూడి విహరించినచ్చుసరి కిదివచ్చినది. ఇంతకంటె నాకేమియు తెలియదు! అన్నది. తృణబిందుమహర్షి 'నిజమేమిటో?' అని ధ్యానదృష్టితోజూచి తెలిసికొని 'అమ్మాయీ! నీవు చెప్పినది నిజమే. పులస్త్యుని శాపముచే నీకిట్లయినది. ఏమియు భయపడకుము' అని ఆమెను తీసికొని పులస్త్యబ్రహ్మకడకేగి నమస్కరించి కన్యనుచూపి 'మహర్షి! ఈమె నాకూతురు గుణవంతురాలు. నీకు శుశ్రూష చేయును, తపోనిష్ఠవలన నీకు శ్రమకలిగినప్పు డీమె నీ బడలిక పోవునట్లు సేవచేయును. ఈమెకు నీ దర్శనమువలన చూలు వచ్చినది కాన దీని పరిగ్రహింపుము.' అని ప్రార్థించుసరికతడు సంతోషముతో నామెను పరిగ్రహించెను. ఆమె పులస్త్యుడు స్నానముచేసి వచ్చుసరికి జపవేదిక అలికి ముగ్గుపెట్టి యుంచె

డిది. అగ్నిహోత్రమునకు దర్భలు, సమిధలు సిద్ధముచేసెడిది. అగ్నిహోత్ర మగుసరికి దేవపూజకు పూలు సమకూర్చెడిది. పూజ కావించునప్పటికి షడ్రసోపేతముగా భోజనము సిద్ధపరచెడిది. ఇట్లు వలసినవెల్ల మనసు నెరిగి సిద్ధముచేయుటతో నామె శుశ్రూషకు సంతసించి 'వనితా! నీ గర్భమున వేదవేదాంగ పారగుడైన సుతుడుపుట్టును. నీవు నా వేదమువిన్నపుడే గర్భము తాల్చినందున ఆ బాలునికి 'విశ్రంవశుడు' అనుపేరు ప్రసిద్ధమగును.' అని చెప్పెను.

అట్లే ఆమెకు పదియవమాసమున సుపుత్రుడుకల్గెను. ఆబాలుడు దినదినప్రవర్ధమానుడై పెరుగుచుండెను. పులస్త్యుడాతని కుపనయనముచేసి మంత్రముల నుపదేశించెను. అతడా మంత్రజపమునకై తల్లిదండ్రుల యనుమతిగొని వనమునకేగెను. అతడు మంచినిష్ఠతో తపమాచరించుచుండెను. ఇతడు తండ్రికి తగిన సుతుడని మహర్షులందరును సంతసించిరి. భరద్వాజ మహర్షి అతని తపోనియమము కలరి అట్టివానిని తన కల్లునిగా చేసికొనుట యుక్తమనితలచి తన కుమార్తెను తీసికొని వెళ్ళి అతనితో 'మహర్షివతంసమా! నీ తపము సాటిలేనిది. బాగుగా నియమము లాచరించుచున్నావు. ఈమె నాకుమార్తె దేవవర్ణిని యీమె పేరు. నీకు ధర్మపత్నియై శుశ్రూషలు చేయగలదు. దీనికైకొను' మనెను. అతడు తనవద్దకువచ్చి పిల్లనిత్తునన్న వలదనరాదని తలచి ఆమె గుణగణములకు సంతసించియు పరిణయమున కంగీకరించెను. భరద్వాజు డామెకు పెండ్లిచేసి వెడలిపోయెను.

# కుబేర జననము

ఆ దంపతులిద్దరు నేకమనస్కులై గృహస్థధర్మముల నేమరుపాటులేక నిర్వర్తించుచుండిరి. అంత నామె గర్భవతియై ఒక్క సుముహూర్తమున పుత్రునికనెను. అప్పుడు బ్రహ్మ వచ్చి 'ఇతడు దీర్ఘాయుష్మంతుడై లోకపాలకుడుగాగలడు' అని దీవించెను. విశ్రవసుని పుత్రుడగుటచే నాతనికి 'వైశ్రవణుడని పేరుపెట్టిరి. ఆ బాలుడు యుక్తవయస్కుడు కాగానే ఉపనయనముచేసి వేదశాస్త్రముల కరపెను. అతడన్నిటను కుశలుడై తండ్రియనుమతిని తపస్సుచేయుట కేగెను. వంశమర్యాదలు తప్పక నడచునుకదా! అతడు నిరుపమానమైన కఠోర నియమములతో తపమాచరించెను. బ్రహ్మదేవుడాతని తపస్సునకు మెచ్చి ప్రత్యక్షమయ్యెను. కుబేరుడెన్నోరీతుల స్తుతింపగా బ్రహ్మ 'వత్సా! నీకేమి కావలెనో కోరు'మనెను. అతడు 'నీవు సంతసించిన నాకేమిలోటుకల్గును? నాకు లోకపాలకత్వము ప్రసాదింపుము. నీవు హిరణ్యగర్భుడవు కనుక నాకు ధనపతిత్వమునిమ్ము' అనికోరెను. బ్రహ్మయునట్లే వరమిచ్చెను. అంతేకాక పుష్పకవిమానము నిచ్చుచు 'కుబేరా! ఇది పుష్పకము. దీనిమీద నెందరెక్కినను ఇంకను అవకాశముండును. ఇది సర్వసుభోగ్యమై సౌఖ్యదాయకమై యుండును. దీనిని నీవు కైకొమ్ము' అని బహూకరించి వెడలిపోయెను.

అంత వైశ్రవణుడింటికివచ్చి తండ్రికి నమస్కరించి 'నీ యాజ్ఞవలన తపస్సుచేసి బ్రహ్మనుమెప్పించి వరముల వడసితిని. నాకు నివాసయోగ్యమైన స్థలమేదియో చెప్పవా?' అని

యడిగెను. అతడు 'రామా! నీ సుగుణములే నీ యభివృద్ధికి కారణములు. దక్షిణ సముద్రమధ్యమున లంకానగరమున్నది. అక్కడి రాక్షసులు విష్ణుని భయమువలన పాతాళమునకు పోయిరి. అది ప్రస్తుతము సావకాశముగా నున్నది. అందు నివసింపుము.' అని సెలవిచ్చెను. కుబేరుడిట్లే పుష్పక విమానముపై లంక కేగి అచ్చట కిన్నర గంధర్వయక్షులు సేవించుచుండగా రాజ్యమేలుచుండెను.

అని అగస్త్యుడు చెప్పుటతో శ్రీరాముడు 'అగస్త్యమహామునీ! లంకలో అంతకుముందే రాక్షసు లున్నారన్నావే. దితి కశ్యపులకు పుట్టిన సంతానము కాక, అంతకుముందే రాక్షసు లెక్కడివారు? వారి జన్మక్రమము చెప్పుము.' అని యడిగెను. అప్పుడగస్త్యుడు 'రాఘవా! నీకు సంశయము వచ్చినప్పుడెల్ల నడుగుము. సంశయనివృత్తి యగునట్లు చెప్పెదను.' అని యీ రీతి చెప్పదొడగెను.

## సుకేశుని కథ

బ్రహ్మ సృష్ట్యారంభమున జలమును సృష్టించి దాని రక్షించుటకై మహాసత్త్వముల గొన్నిటి సృజించెను. వారు 'భగవంతుడా! మమ్మేల సృజించినావు? మాకర్తవ్యమేమి?' అని ప్రశ్నింపగా అతడు నవ్వుచు 'మీరీ జలమును రక్షింపుడు' అనెను. అంత కొందరు క్షుద్బాధవలన 'జక్షామ (తిందుము)' అనియు, కొందరు 'రక్షామ (రక్షింతుము)' అనియు అనిరి. అందు 'జక్షామ' అన్నవారు 'యక్షు'లైరి. 'రక్షామ' యన్న

వారు 'రాక్షసు'లైరి. అందు రాక్షసకోటిలో ప్రథములు, బలశాలురును హేతిప్రహేతులు. అందును ప్రహేతి యుదారుడు. మంచివాడు. సద్గుణములు కలవాడు. హేతి దుర్గుణములు కలవాడు. హేతి 'భయ' యను కన్యకను బ్రహ్మమాటప్రకారము పెండ్లాడెను. వారికి 'విద్యుత్కేశుడు' అను కుమారుడు కల్గెను. అతడు తల్లిదండ్రులబోలె భద్రముగా పెరుగుచుండెను. వివాహయుక్తవయసు రాగానే అతనికి సంధ్యాపుత్రినిచ్చి పెండ్లి చేసెను. వారిద్దరును మహోత్సాహముతో కాపురము చేయుచుండిరి. అంత నామె గర్భవతియైనది. బాలుడు కలుగ సమయమువచ్చినది కామె అతని నొక పర్వతముపై పడవేసి సుఖాభిలాషతో భర్తను చేరినది. సుఖములెంత ప్రీతిపాత్రములైనను స్వసుఖాంతరాయము కల్గించువేళల విద్వేషములే యగుదురుకదా!

అట్లు వదలిన బాలుని సమీపమునకు దైవాద్వా పార్వతీ పరమేశ్వరులు వచ్చిరి పార్వతి కా బాలుని చూడగానే దయ కల్గినది. 'ఎవతెయో రాతిగుండెది పసికందును విడనాడిపోయినది. ఇతనిని రక్షింపుము' అని భర్తను వేడినది. శివుడు భార్యను సంతోషపరచుటకై ఇతనికమర్త్యత్వము, సర్వనిర్జయత్వము కల్గును' అని వరమిచ్చెను. పార్వతి 'ఇది మొదలు రాక్షసులకు సద్యోగర్భమును, పుట్టగానే పిల్లలకు యౌవనమును వచ్చుగాక!' యని వరమిచ్చినది. పుట్టగానే తల్లి అనాథల పారవేసిన బిడ్డకు అదృష్టవశాత్తు యోగులకుసైతము కనరాని ఆదిదంపతులు కృపచేసి వరములిచ్చిరి. 'ఏ రక్షయు లేనివారికి దైవమే రక్ష' యున్నదే. ఒకరినొకరు చెరుపలేరు; బాగు

చేయనులేరు. అతని సుకృత దుష్కృతములే అతనికి సుఖ దుఃఖములు కల్గజేయును.

అతడెల్లు సూర్యునివలె తేజోవిరాజమానుడై 'సుకేశు డను' పేర ప్రసిద్ధుడై యుండెను. అతని తేజస్సుగాంచి గ్రామణి యను గంధర్వుడు తనకూతురగు దేవవతినిచ్చి పెండ్లి చేసెను. వారిద్దరును పరస్పర ప్రీతితో కాపురము చేయుచు రాక్షసరాజ్యము నేలుచుండిరి. వారికి 'మాల్యవంతుడు, సుమాలి, మాలి' అను ముగ్గురు కొడుకులు పుట్టిరి. వారు ముగ్గురును తండ్రికంటె వర ముల పొందదలచి బ్రహ్మను గూర్చి ఘోరముగా తపము చేసిరి. బ్రహ్మ వారి తపమునకు మెచ్చి ప్రత్యక్షమై 'మీతపస్సునకు మెచ్చితిని. మీకేమి కావలెనో కోరుకొమ్ము' అనెను. వారు "తాతా! మాకు దిక్పాలకుల జయించుశక్తియు, దీర్ఘాయుర్దా యము, ఆరోగ్యము, ప్రతిభా ప్రతాపములును కల్గవలెను" అని కోరిరి. బ్రహ్మ అట్లే వరములిచ్చెను.

వారా వరముల మూలకముగాని మదాంధులై దేవతలను బాధింపనారంభించిరి. వారి బాధలకు తాళలేక దేవతలు, గంధ ర్వులు, సిద్ధసాధ్యాదులును భయపడి పారిపోజొచ్చిరి. వారు స్వర్గ మునకేగి విశ్వకర్మనుజూచి 'శిల్పిశ్రేష్ఠుడా! మాకు చక్కని నగరమును నిర్మించిపెట్టుము.' అనిరి. అతడు "నే నిదివరలో నిర్మించిన నగరమొకటి దక్షిణసముద్ర మధ్యమునయున్నది అది అరువదామడ వెడల్పును, వందామడ పొడవును, కలిగి తొమ్మిదిద్వారములు, ఏడు ప్రాకారములుకలిగి చక్కని ప్రాసాదములతో వెలుగొందుచున్నది. అది మీకు నివాస

యోగ్యమైయుండును.' అని చెప్పినరికి వారచ్చటికివెళ్ళి రాజ్యమును ప్రతిష్ఠించుకొనిరి. వారిమాట కష్టులేదు. మాల్యవంతుడు మొదలైనవారికి నర్మదయను గంధర్వస్త్రీ తనకూతులను ముగ్గురినిచ్చి పెండ్లిచేసెను. వారికి ధనముకల్గుటతో రాక్షసులని యెంచక ఆమె తనకూతుల నిచ్చినది. మాల్యవంతుడు సుందరిని, సుమాలి కేతుమతిని, మాలి వసుదాభామినిని పెండ్లాడిరి. వారికెందరో సంతానము కల్గిరి. అందు సుమాలి కూతురు కైకసి ఆ రాక్షసులందరు తామరతంపరలై దేవతలను పలుతెరంగుల బాధింపజొచ్చిరి.

దేవతలా బాధ సహింపజాలక శివునివద్దకేగి మొర పెట్టుకొనిరి. కాని అతడు 'బ్రహ్మ వారికి వరములిచ్చినాడు. నేనేమియు చేయజాలను. విష్ణుమూర్తివద్ద కేగుడు' అని చెప్పెను. 'సరే' అని వారందరును క్షీరసాగర శయానుడైన లక్ష్మీవల్లభుని చేరి పెక్కుకీర్తుల స్తుతించిరి. అతడు సంతుష్టుడై వచ్చిన పనేమని యడుగగా వారు 'మహానుభావా! నీవెరుగనిదేమున్నది? మాల్యవందాది రాక్షసులబాధకు తాళలేకున్నాము. నీవే శరణ్యము. మమ్ములను రక్షింపు'మనిరి. విష్ణుమూర్తి 'దేవతలారా! మీకేమియు భయములేదు. నేను వారినెల్ల జయించి మీ భయము పోగొట్టుదును' అని వారికభయమిచ్చి పంపెను.

ఈ వార్త గూఢచారులద్వారా విని మాల్యవంతుడు తమ్ములను రావించి 'తమ్ములారా! మనబాధలను దేవతలు విష్ణువుతో చెప్పుకొనిరట. అతడు మనల నిర్జించుటకు మాట

యిచ్చెనట. తక్కువవానితో యుద్ధమును, సమానమైన వానితో స్నేహమును, ఎక్కువవానితో దాస్యమును చేయవలెనని. ఇక మన ఆగడములు సాగవు. బలవద్విరోధము మంచిదికాదు. తగ్గియుండవలెను' అని చెప్పెను. కాని అవి వారి చెవికెక్క లేదు. వారతనితో 'అన్నా ! నీవు చెప్పినదిబాగుగనే యున్నది. కాని మనలను విష్ణువు శిక్షించుట కతనిజోలికి మనమేమి పోలేదు. అతడంత అన్యాయముగా మనమీదికి రాదలచినచో మన సంధిప్రయత్నములు మాత్రమెట్లు కొనసాగును. లేక దేవతలే ఈ పనికంతకును మూలకారకులు కనుక ముందుగా వారిపని పట్టుదము' అని మంత్రాంగముచేసి దేవేంద్రునిపై దండెత్తిరి.

ఆ వార్త యెరిగి విష్ణుమూర్తి దేవతల పక్షమున యుద్ధమునకు వచ్చెను. అతనిని చూచి రాక్షసులు 'హరీ ! వచ్చితివా ? నిలుము. నీకై యెదురుచూచుచున్నా'మని అతని నెదిర్చిరి. వారు కురిపించు శరవర్షము కొండమీద వానకురిసినట్లతనిమీదబడి నిష్ఫలమైనది. అతడు శార్ఙ్గ మెక్కుపెట్టి శరపరంపరలు వదలుటతో రాక్షసులు చికాచికలైపోయిరి. వారిని వారించి సుమాలి ముందునకు వచ్చి విష్ణువు నెదిర్చెను. ఎన్నో బాణములు వేసెను. పరశువు, ముద్గరము, శక్తి మొదలైన ఆయుధముల నెన్నిటినో విసరెను. అన్నిటిని క్షణములో తుత్తునియలుచేసి విష్ణువు వానితాటలు తెగగొట్టెను. అతని ధాటి కాగలేక సుమాలి పారిపోయెను. అంత మాలివచ్చి విష్ణు నెదుర్కొనెను. వారిద్దరికిని పోరు ఘోరముగా సాగినది.

మాలి శక్తితో గరుత్మంతుని నెత్తిపై మోదెను. ఆ దెబ్బకు దిమ్మతిరిగి గరుడు చక్కిరిబిక్కిరి యయ్యెను. విష్ణువు గరుత్మంతుని తలనిమిరి బాధలేకుండ జేసి పురికొల్పెను. అతడు నూతనోత్తేజముతో రాక్షసులమూక నెదిర్చి రెక్కలతో ఎగురగొట్టుచు, కాళ్లతో తన్నుచు వారిని చెల్లాచెదరు చేసెను. విష్ణువాతని యుద్ధలీల నణచుటకై చక్రమును ప్రయోగింపగా అది మాలి తలను నరికెను. దానితో రక్కసిసేనలు పిక్కబలము చూపినవి. అయినను వారిని విష్ణువు చెండాడుచుండెను.

అప్పుడు మాల్యవంతుడు ముందునకు వచ్చి 'మాధవా! రణధర్మము నీ వెరుగనిది కాదు. పరుగెత్తు వారిని చంపుట తగునా? అట్టివాడు స్వర్గమునకే అర్హుడు కాడందురు. నీవే యిట్టి యకార్య కరణముచేసిన ఇంక అనువారెవ్వరు? యుద్ధము నాతో చేయుము' అనగా హరి 'రాక్షసరాజా! నీవు చెప్పు న్యాయము నేనును ఎరుగుదును. కాని ఇంత ఎరిగినవాడవు పరుగులెత్తిన దేవతల నెట్లు చంపితివి? అక్కడ ఈ నీతులు జ్ఞప్తికి లేవే? మంచికి మంచి; చెడునకు చెడు సరిపోవును. అదే ధర్మము. దేవతలను మీ రనవసరముగా బాధించిరి. వారు నాకు ప్రాణతుల్యులు కనుక నేను వారి పక్ష మవలంబించితిని.' అనుచు కన్నుల నిప్పులు రాలునట్లు చూచుచు అతనితో సంగ్రామము సాగించెను. అతడును యుద్ధము వెనుదీయక విష్ణుని నొచ్చునట్లు కొట్టెను. అతని పరాక్రమమున కెల్లరును మెచ్చిరి. అంత పెచ్చుపెరిగి గరుడుడు, విష్ణుడును యుద్ధముచేయగా రక్కసులందరును లంకత్రోవ పట్టిరి. ఇట్లు పరాజితులై వారు

లంకలో నుండిన యిక్కట్టులు తప్పవని రసాతలమునకు పారిపోయిరి. అట్లు దైతేయులకు పూర్వమే అక్కడ రాక్షసులు నివాసమేర్పరచుకొనిరి. కాని విష్ణుమూర్తివలని భయముచే రసాతలమునకేగి లంక పాడువడగా కుబేరుడు దాని నాక్రమించుకొని యుండెను.

## రావణ కుంభకర్ణాదుల జననము

ఒకప్పుడు సుమాలి తన కూతురైన కేకసిని తీసికొని వాహ్యాళికేగెను. ఆ సంచారములో అతడు కుబేరునిచూచెను. అంతటెంత అందముగానున్నాడు! ఎంత తేజశ్శాలి! ముల్లోకముల నేలునట్టి శక్తి అతనిముఖమున కన్పించుచున్నది. అతని నెగాదిగా చూచి, 'ఇట్టి కొడుకునుకన్న విశ్రవోముని ఎంత ప్రతిభావంతుడు! అతనికి నా కూతురునిచ్చి పెండ్లిచేసెదను. నాకుకూడ ఇట్టి మనుమలు పుట్టుదురు. కొడుకులు కాకున్న మనుమలైన వృద్ధిలోనికివచ్చి పేరుతెత్తురేమో' అనుకొని కూతురికి కుబేరుని చూపించి 'కుమారీ! నీవు మంచిగుణవతివి. నీవుకూడ అట్టి కొడుకులను కనవలెను. మంచిసుతులను కన్నట్టి సతులు పుట్టినింటికి మెట్టినింటికి పేరుతెత్తురు. నీవు విశ్రవసుని సేవించి అతనిదయకు పాత్రురాలవై సత్సంతానమును బడయుము.' అని బుద్ధులు చెప్పి, దీవించి ఆమె నా మునివద్దకు పంపెను. ఆమెయు తండ్రిచెప్పినట్లు విశ్రవసునివద్దకువెళ్ళి, అతడు సమాధిలోనుండగా చేతులుకట్టుకొని ఎదురుగానిలబడినది. అతడు లేచినతర్వాత నమస్కరించెను. అతడామెనుచూచి

'నీ కోరికయేమనఁగా' ఆమె సిగ్గుతో తలవంచి యూరకొన్నది. అతఁడామె ధ్యానమునెరిగి 'నీ వెవ్వరిదానవు? నీకుల శీలాదులెవ్వి?' అని ప్రశ్నించెను. ఆమె తన కులగోత్రములు చెప్పినదే కాని, వచ్చినపని చెప్పలేకపోయెను. ఎట్టి స్త్రీలకును సిగ్గు సహజము కదా! అతఁడు దివ్యదృష్టిని అంతయు నాకళించి 'సుతుని కోరి నీవు వచ్చితివి. మంచిదే కాని ఇది సంధ్యాసమయము. ఈ సమయమున కల్గువారలు రాక్షసబుద్ధులు కల్గియుందురు' అనెను. అందులకామె 'మహాత్మా! మిమ్ములను సేవించుట మంచివారిని కనుటకే కదా!' అనిన అతఁడు 'మానినీ! కాలము దాటుటకు ఎవ్వరికిని శక్యముకాదు నీ పుత్రులలో ఆఖరివాఁడు తపోవిద్యాగరిష్ఠుఁడై సద్గుణుఁడగును. అని యామె కోరిక తీర్చెను. ఆమె గర్భవతియై పదితలలు ఇరువది చేతులుకల కొడుకును కన్నది. విశ్రవసు డతనికి దశగ్రీవుఁడని పేరుపెట్టెను. తరువాత కుంభకర్ణుని, శూర్పణఖను కని తుదకు భగవద్భక్తి పరాయణుండగు విభీషణుని కన్నది. ఆ ముగ్గురుకొడుకులును చిన్నప్పటి నుండియు మహావీర్యసంపన్నులై బాల్యక్రీడలలోనే వారి భావి జీవితమును కనుపరుపఁజొచ్చెను. రావణ, కుంభకర్ణులు పెద్ద కొండల నెత్తిపారవేయుచు మహావృక్షముల నుత్పాటించుచు సింహశార్దూలాది క్రూరమృగములను పట్టి బంధించుచు, ఆటపాటలలో దారుణక్రియలు చేయుచుండిరి. విభీషణుడు తండ్రికి దగ్గరగానుండి జపతపములు చేయుచు, అన్నలు పట్టి బంధించిన మృగములను విడుచుచు, మునులను రక్షించుచు ఉపకారబుద్ధికలిగియుండెను. మునులందరును విభీషణుని దీవించుచుండిరి

# రావణాదుల తపస్సు

ఒకనాడు కేకసి పెద్దకొడుకును పిలచి స్వభావసిద్ధమైన క్రౌర్యముతో 'నాయనా! చూచితివా? మీ అన్న యెంత అదృష్టవంతుడో? యక్షులకు రాజై లంక నేలుచున్నాడు. నీవు కూడ అంతటివాడ వెప్పు డగుదువో?' అని యుద్బోధించెను. రావణు డామెతో, తల్లీ! నేను వానికి తీసిపోదునా? కఠోరమైన తపస్సుచేసి అతనిమించు భోగభాగ్యములు పొందెదను. దీవించి పంపుము.' అని తమ్ము లిద్దరిని పిలిచి, 'మనము బ్రహ్మదేవుని గూర్చి తపస్సుచేయుదము. అతడు భక్తకల్పద్రుమము. కోరిన కోరికల నిచ్చును.' అని వారిద్దరిని పురిగొల్పి గోకర్ణక్షేత్రమున ఉగ్రమైన తపస్సు చేయదొడగెను. పట్టుదల కలవారు సాధింపలేని దేమున్నది? వారు ముగ్గురును ఘోరదీక్షతో ఏ మునులు చేయజాలనంత కఠిన నియమములతో తపస్సు చేయుచుండిరి.

అందు రావణుడు నిరశనవ్రతను పూని వెయ్యేళ్లకొక తల చొప్పున తన తలలు నరుకుచు వీరహోమము చేయుచు తొమ్మిదివేల సంవత్సరములు తపస్సుచేసెను. పదవ వెయ్యి కూడ నిండవచ్చినది. అంత దేవతలు బ్రహ్మదేవునికడ కరిగి 'మహాత్మా! రావణు డతికఠినముగా తపస్సుచేయుచున్నాడు. ఆ తపోగ్నిజ్వాలలు లోకములను తపింపచేయుచున్నవి. అతడు నీవలన వరములు పొంది లోకమును తపింపజేయుమాట యెట్లున్నను, ఇది అంతకంటె మించిపోయినది. నీవింక నాలసించిన అతడు పదియవతలనుకూడ నరకికొనును. అందుచే నాలస్యము చేయక అతని కోరిక లీడేర్పుము.' అని కోరిరి.

అప్పుడు బ్రహ్మదేవుడు హంసవాహనమెక్కి, గాయత్రీ, సావిత్రీ, సరస్వతులు తన్ను సేవించుచుండగా రావణునికడకు వచ్చెను అప్పటి కతడు పదియవతలను నరకుకొనుటకై కత్తి నెత్తెను. బ్రహ్మ, 'వత్సా! నీ తపమునకు మెచ్చితిని. తల నరుకు కొనవద్దు' అని పలుకుటతో అతడు సాహసము మాని బ్రహ్మకు నమస్కరించి అనేకవిధముల స్తుతించెను. అప్పు డతడు 'నీకేమి వరము కావలెనో కోరుకొనుము'నగా 'జీవులకు మృత్యువే భయంకరమైనది దేవదానవ, గంధర్వాదులవలన మృత్యువు లేకుండు నట్లు వరముప్రసాదింపుము. మనుష్యులు నా కొక లెక్కకాదు అనిన విధాత' అట్లే యగును. నీ తొమ్మిదితలలు తిరిగి మొలచును. సుఖముముగా నుండుమ'ని విభీషణునిదగ్గరకు వెళ్లెను. బ్రహ్మకు సాష్టాంగనమస్కారముచేసి స్తుతించెను. అప్పు డతడు 'నీకేమి వరము కావలెనో కోరుకొమ్మనెను. 'మహాత్మా! చరాచరజగత్తును సృష్టించు నీ దర్శనమబ్బినది ఇంతకంటె వేరు వరమేమి కావలెను? అయినను నీవు 'కోరుకొమ్మన్న ప్పుడు కోరుకొనకుండుటయు భావ్యముకాదు. ధర్మమే సకల లోకస్థితికి కారణమని వినియున్నాను. అందుచే నా మనస్సెప్పుడును ధర్మమందాసక్తమై యుండునట్లు వరమిమ్ము. బ్రహ్మాస్త్రము నా కభీనమగునట్లు ప్రసాదింపుము.' అని కోరెను. బ్రహ్మదేవుడు సంతోషించి 'నీవు రాక్షసస్త్రీకి జన్మించినను శాంతగుణప్రధానుడవై వరము కోరినందున నీకు దేవత్వము (చావులేకుండుట) ప్రసాదించితిని. నీవు రాక్షసులలో కెల్ల శ్రేష్ఠుడవు కమ్ము' అనెను. అందుల కందరును సంతసించిరి.

పరహితము కోరు వారికి ఎట్టి శుభము కల్గినను అందరికిని హర్ష దాయకమే అగును.

బ్రహ్మదేవుడు కుంభకర్ణునికి వరములిచ్చుటకై వెళ్లు చుండెను. అప్పుడు దేవతలందరును, 'మహానుభావా! కొంచె మాలోచింపుము. ఇతడు కడుదుర్మార్గుడు. ఏ వరమును లేకయే ఇతడు లోకములను భ్రమింపగలడు. ఇక వరసాహాయ్యమున్న చెప్పనేమున్నది?' అతనికి వరములీయవద్దు అని ప్రార్థించిరి. అంత బ్రహ్మ సరస్వతివంక చూచెను. ఆమె చిరు నవ్వుతో పతిని క్రీగంట చూచుచు 'స్వామీ! నా కర్తవ్య మేమి? వక్కాణింపుము' అన్నది. నలువ ఆమెతో 'సరస్వతీ! సకలజీవులను నీవు ముఖమందున్నంతసేపే ఇష్టమువచ్చినట్లు పలుకగలరు. నీవెటు త్రిప్పిన, నాలుక అటు తిరుగవల సినదే. అందుచే నీవు ముందుగా అతని హృదయమున ప్రవే శింపుము. నిరాబాధమైన వరము కోరునట్లు చేయుము' అని చెప్పెను. ఆమె అట్లే కుంభకర్ణునిలో ఆవేశించినది.

బ్రహ్మదేవుడు కుంభకర్ణుని సమీపించి 'నాయనా! లెమ్ము. నీ తపమునకు మెచ్చి వరములీయవచ్చితిని. కోరుకొమ్ము!' అనిన అతడు లేచి నమస్కరించి, స్తోత్రముచేసి, 'నాకు ఆరు మాసములు నిద్రయు, ఒక్కరోజు భోజనమును కల్గునట్లు వర మిమ్మ'ని కోరెను. అతడదివిని, "నాయనా! సుఖముగా నిద్ర పొమ్ము' అని పలికి నిజలోకమునకు పోయెను. తర్వాత అత నికి ఒడలు తెలిసినది. జరిగినదానికి నగచుచు, 'అయ్యో! దైవమా! ఇన్నాళ్ళు శ్రమపడి తపస్సుచేసి చివరికి నిద్రకోరితినే.

నావంటి వెఱ్ఱివాడుండునా? పురుషప్రయత్నమునకు దైవము తోడైనప్పుడే ఇష్టార్థసిద్ధి కల్గును. అట్లు కాకున్న ఏవియును సిద్ధింపవు.' అనుకొనుచు దీనుడై కూర్చుండెను. అంతలో తక్కినవారు అతనిదగ్గరకువచ్చి, అతని నూరడించి తల్లివద్దకు వెళ్లిరి. తల్లిదండ్రులకు నమస్కరించిరి.

అంత రావణుడు బ్రహ్మవలన వరములు పొందినదివిని సుమాలి తన బంధుమిత్రులతో అచ్చటికి వచ్చెను. రావణుడు మాతామహునికి నమస్కరించెను. అత డాతని లేవనెత్తి, 'నాయనా! నీవు గొప్పకార్యము సాధించితివి. రాక్షసులకు భూమిలో తావుండునట్లుచేయ సమర్థుడవైనావు. ఇదివరలో దేవతలు మనవారినందరిని లోకాంతరమునకు పారద్రోలినారు. నా ప్రేరణచే విశ్వకర్మ లంకను సృజించెను. అందు మేముండువారము. కాని తరువాత మా దురదృష్టవశమున మేముపోగా కుబేరుడు దానినాక్రమించినాడు. నీవు దానిని మరల స్వాధీనము చేసికొనుము. వరబలమున్నదికదా. నీ కెవ్వరును అడ్డురారు.' అని బోధించెను. అదిరావణునకు నచ్చలేదు. అతడు 'తాతా! నీవన్నది నిజమేకావచ్చు. కాని ఎంతదుర్మార్గుడైనను అన్నను పారద్రోలి అతడు కాపురమున్న యింటిని ఆక్రమించునా? అది న్యాయముకాదు' అనెను. సుమాలి అప్పటికి తానేమన్నను మనుమనికి హితముకాదని యూరకుండెను.

తరువాత నొకప్పుడు ప్రహస్తుడు, సుమాలి కొడుకు, రావణుడుల్లాసముగా నున్నప్పుడు దగ్గరకుచేరి మెల్లగా 'రాక్షసేశ్వరా! నీ భుజబల మెవ్వరికినిరాదు. దానికి వరబలముతోడై

నది. నీకెవ్వరును సాటిరారు. నీయంతబలము లేకున్నను కుబేరుడు మనవారు కట్టించిన లంక నేలుచున్నాడు. నీవేదో భ్రాతృస్నేహమందువు. కాని దేవతల కిసుమంతయైనను భ్రాతృ మున్నదా? వారు రాక్షసులను ఈలోకములోనుండనిచ్చిరా? అట్టియెడ మనమేల ప్రతీకార మాచరింపరాదు? నీవే యాలోచించుకొనుము.' అని పురికొల్పెను. చెప్పుడుమాటలు చెడ్డవి. దానితో అతనిమనస్సు విరిగినది. కొంచె మాలోచించినాడు. అతడన్నది యదార్థముగానే తోచినది. అప్పు డతనితో, 'ప్రహస్తా! నీవే కుబేరునివద్దకు వెళ్ళి, నామాటగా లంకను నా కిమ్మనుము. అంగీకరించిన, సరే. లేకున్న అప్పుడే దండోపాయముచే సాధింతము.' అని ప్రహస్తుని కుబేరునివద్దకు రాయబార మంపెను.

అతడు త్వరగా లంకకు వెళ్లెను. అప్పుడు కుబేరుడు సభలోనున్నాడు. అతడు సభలోనికివెళ్ళి "యక్షేశ్వరా! నీ తమ్ముడైన రావణుడు నీకు నమస్కరించి, నీతో ఒకమాట చెప్పుమనినాడు. 'మన మాతామహునకై నిర్మించిన యీ లంకను నీవు కొన్నాళ్ళనుండి పాలించుచున్నావు. ఇప్పుడు రాక్షసులందరును వచ్చినారు. అందుచే నేను కొన్నినాళ్ళు లంకలో రాక్షసరాజ్యము చేసెదను. లంకను నాకువదలుము.' అని నీతో చెప్పుమనినాడు." అని చెప్పుటతో కుబేరుడు 'దాని కేమి? నాతమ్ముని అనుమానములేకుండ రమ్మనుము. లంక నతడే యేలుకొనును. మా యిద్దరిలో యెవరైనను ఒకటే.' అని జవాబిచ్చెను. ప్రహస్తుడామాట విని, మహానందముతో

ఒక్క అడుగులో రావణునిచేరి కుబేరునిమాటలు చెప్పెను. అతని వాక్యములకు 'కుబేరుడు నీపేరువినుసరికి దడదడలాడి వదలి పోయినాడు. లేకున్న నీ శౌర్యబలమెరుగడా?' అనిరి.

కుబేరుడు వెంటనే పుష్పకవిమానముపై బయలుదేరి తండ్రివద్దకు వచ్చి, నమస్కరించి, జరిగినది చెప్పెను. అంత నతడు 'నాయనా! అతడు కడుదుర్మార్గుడు. ఎవ్వరు చెప్పినను వినడు. ఇప్పటికతని దౌర్జన్యమునట్లుసాగనీ. నీవు కైలాసముదరి కేగి అక్కడ మరియొకపట్టణమును నిర్మించుకొని కాపుర ముండుము. ఈశ్వరునిగూర్చి తపస్సుచేసి అతని మెప్పింపుము. నీ వైశ్వర్య మభివృద్ధిపొందును' అని చెప్పెను. కుబేరు డాతడు చెప్పినట్లే కైలాసమునకు దగ్గరగా అలకాపట్టణమును నిర్మించు కొని, అందు యక్షరాజ్యమేలుచుండెను.

## రావణుడు లంక చేరుట

ఇచ్చట రావణాసురుడు సుమాలి మొదలైన బంధువర్గ ములను తీసికొని, తల్లిని బంగారుపల్లకీపై నెక్కించుకొని, ఒక శుభముహూర్తమున లంకలో ప్రవేశించెను. రాక్షసులం దును లంకానివాసులగుటతో చాల సంతోషించిరి. అంత రావణుడు వివాహ యుక్తవయస్కు యగు తనచెల్లెలిని విద్యు జ్జిహ్వున కిచ్చి మహావైభవముతో వివాహము చేసెను.

# రావణాదుల పెండ్లిండ్లు

తరువాత నొకనాడు వేటకై ఒక నిర్జనారణ్యమునకు వెళ్లెను. అచ్చట నా రావణునకు మయుడు, అతని కూతురును కనపడిరి. ఆమె చాల చక్కనిది. ఆమె అందము చూచుసరికి రావణుని కోడలు తెలియలేదు. ఆమెను పెండ్లియాడని తన భోగభాగ్యము లెందుకని యనుకొనినాడు. ఎట్లైనను ఆమెను తన దైవసము చేసికొనదలచినాడు. మయుడు పోవు దారికి అడ్డముగా పోయి నమస్కరించి, 'అయ్యా! మీరెవరు? ఇట్టి నిర్జనారణ్యమున ఒంటరిగా నుంటిరేల?' అని ప్రశ్నించెను. అందుల కతడు 'నేను దానవ శిల్పాచార్యుడను. నా పేరు మయుడు. ఈమె నాకూతురు. ఈమెపేరు మందోదరి. నా శిల్పమునకు మెచ్చి, దేవతలు నాకు హేమయను నప్సరసనిచ్చినారు. నేనామెకై హేమపురమను సుందరమగుపట్టణమును నిర్మించి, అందు అయిదువందల సంవత్సరములు సుఖముగా కాలముగడపితిని. అదేమి మాయయో! హేమతో నున్నన్ని నాళ్లు నాకు సంవత్సరము గడియలాగున వెళ్లిపోయెడిది. ఇప్పుడామె లేకపోవుటతో నాకు గడియయొక్క యుగములాగున నున్నది. దానికేమి? ఆమెకు మాయావి, దుందుభి అను కొడుకులు, మందోదరియను కన్యక కలిగినారు. అంత దేవతలు కబురుపెట్టగా ఆమె వెళ్లిపోయినది. ఆమెలేని హేమనగరము నా కరణ్యమైనది. ఈమె పెండ్లి కెదిగినది. తగినవరుని చూచి యీామె నిచ్చెదమని వెదకుచుంటిని! అనెను.

అంతటితో ఊరకొనిన బాగుండెడిది. 'కుబేరునకెంత పొగరువచ్చినది. లంకను విడిచెనుకదా యని మన్నించి వదలినందులకు నాకే బుద్ధులు చెప్పవచ్చినాడు. అతని పని పట్టెదను' అని ప్రహస్తునితో 'దండయాత్రకు సేనలను సిద్ధము చేయింపుము' అని యాజ్ఞాపించెను. రాక్షసులు ఒడలు తీటయెక్కి యున్నారు. వారికి యుద్ధములేనిరోజు ఉపవాసమే. యుద్ధము వచ్చినదన్న పండుగవచ్చినట్లున్నది. పరగర్వితుడైన రావణుడు రాజైయుండగా అడ్డేమున్నది? అందరును పెండ్లికి వెళ్ళినట్లు మహోత్సాహముతో అలకాపురిమీదికి దండెత్తిరి. ఆ వార్త తెలిసి కుబేరుడు యక్షసేనల నంపినాడు. వారు రాక్షసులధాటికి కాగలేకపోయిరి. తుదకు కుబేరుడే యుద్ధములోనికి వచ్చినాడు. అక్కడకూడ తమ్మునికెన్నియో నీతులు బోధించినాడు. చేతకానివానికి నీతులు, కాని బలవంతునకు నీతులెందుకు? అతడెవన్నియు పెడచెవిని పెట్టి 'నిన్నానాడు వదలినందులకు ఈనాడు చెట్టెక్కితివి. ముందు నిన్ను నీవు రక్షించుకొనుము. తరువాత నాకు బుద్ధులు చెప్పవచ్చును' అని నారిసారించి యుద్ధముచేయ మొదలిడెను. అప్పుడు రావణుని దైవబలము బాగున్నది. అందుచే కుబేరుడు వానిదెబ్బల కాగలేక రథముపై మూర్ఛపోయినాడు. వెంటనే రథసారథి రథమును గుప్తప్రదేశమునకు తోలుకొనిపోయినాడు. ఇక రావణు నెదిరించువారు లేరు. ఊరిలో నున్నట్టి కావలసిన వస్తువులన్నిటిని తీసికొని, సేనలతో పుష్పకవిమానమునెక్కి లంకకు బయలుదేరెను.

# రావణగర్వభంగము

దారిలో ఒకచోట ఆ విమానము ఆగిపోయినది. కదలుట లేదు. కొందరు రాక్షసులు 'ఆ కనబడు కొండపై శివుడో అడ్డము కల్పించియుండును' అనిరి. అప్పుడు క్రిందనున్న నందీశ్వరుడు వారల చూచి 'ఇక్కడ పరమేశ్వరుడు పార్వతితో విహరించుచున్నాడు. అందుచే ఈ విమానము కదలుటలేదు' అనెను. రావణుడతనిని చూచి వికటముగా నవ్వెను. నందీశ్వరునకు కోపము వచ్చెను. 'నీవు కోతి మొగమువలె నా ముఖమున్నదని నన్ను చూచి నవ్వి నందుకు ఒక కోతివలన నీకు పరాభవము కలుగును. ఎల్లకాలమును నీగర్వము సాగదు. కోతులవలననే నీ లంక నాశనమగును.' అని శపించెను. రావణుడా మాటలు పాటించలేదు. అతని కండకావరము పుట్టినది. 'ఈశ్వరు డేకాంతముగనున్నాడా? అతడంతటి బలశాలియా? చూచెదను. ఈ కైలాసమునే తీసి అవతలపారవేసెదను! అని తన యిరువది చేతులతోను కైలాసము నెత్తబోయెను.

ఆ అకాల భూకంపమునకు కారణమేమియో తెలియక మునులెల్లరు భయమందిరి. ప్రమథగణములు పరుగులారంభించిరి. పార్వతి భయపడి ఈశ్వరుని గట్టిగా కౌగలించుకొన్నది. అది యతనికెంతో ప్రియమైనది. అందుచే నతనికి కోపము రాలేదు. చిరునవ్వుతోనే రావణునకు బుద్ధిచెప్పదలచి, కాలి వ్రేలితో పర్వతము నదిమెను. దానితో అతడు కందులమూట క్రింది ఎలుకవలె 'మొఱ్ఱో' అని కేకవేసెను. ఆ కేకకు ప్రాణులన్నియు భయమందినవి. లోకులందరు భయపడునట్లు గర్జించిన వాడు, కాన ఇతనికి 'రావణుడ'ని పేరువచ్చినది.

అతడట్లు కొన్నాళ్లు ఘోషించిపోయెను. కాని కదలుటకు శక్తి రాలేదు. ప్రహస్తాది మంత్రులు ఇతనికడకు వచ్చి 'ఈశ్వరుని స్తోత్రము చేయుము. అప్పుడుగాని నీకీ బాధ తగ్గదు' అనిరి. అప్పుడతడు తాను చదివిన శాస్త్ర పాండిత్యము వెల్లడియగునట్లు అనువుగా సంస్కృతశ్లోకములతో భగవంతుని నుతించెను. అందులకా పరమేశ్వరుడు సంతోషించి, 'వరము కోరుకొమ్మ' నెను. రావణుడు 'దీర్ఘాయువు, చంద్రహాసమను కత్తిని యిమ్మ' నెను. శివుడట్లే యనుచు, 'నీవు అవినీతుండవైన నా వరములు నన్నే చేరును' అని ఉపసంహారముతో వరమిచ్చెను.

రావణుడు దుస్స్వలనుండి బయలుదేరి హేమకూటము, హిమవంతము మొదలైన పర్వతములమీద సంచరించుచు, ఎవరైనను దేవ, గంధర్వాది యువతులు కంటికగపడిన, వారి నెల్ల తనవశము చేసికొనుచు, స్వేచ్ఛావిహారుడై సంచరించుచుండెను.

## వేదవతి కథ

అంత నొకనాడు హిమవత్పర్వతముమీద ఒక వనములో తపస్సుచేయుచున్న కన్యకను చూచెను. ఆమె సౌందర్యము సాటిలేనిది. ముఖము వెన్నెలలు విరియుచున్నది. ఆమెను చూచుసరికి, రావణునకు కోరిక హెచ్చినది. 'యువతీమణీ! నీ వెవ్వరవు? ఎవరిదానవు? ఈ క్షేత్రాయమున తపమేల చేయుచుంటివి? చెప్పుము' అనెను. ఆమె 'నేను కుశధ్వజుడను మహర్షి కూతురను. మా తండ్రి వేదము చదువు

చున్నప్పుడు పుట్టినందున నాకు 'వేదవతి' అని పేరు వచ్చినది. నాకు యౌవనము రాగానే బృహస్పతికొడుకు తనకిమ్మని కోరి నాడు. కాని నా తండ్రి 'విష్ణువునకేగాని మరియొకనికి నా కన్యక నీయన'నినాడు. ఒకనాడు శంభుడను రాక్షసుడు వచ్చి, నన్ను తన కిమ్మని కోరెను. మా తండ్రి యొప్పుకొననందున ఆ రక్క సాధముడు ఆతని నరికివేసెను. మా తల్లి సహగమనము చేసినది. నేను నా తండ్రి శపథము చెల్లించుటకై తపము చేయుచున్నా'ననెను.

అంత రావణుడు 'వెఱ్ఱిదానా! నీకీ యౌవన మెన్ని నాళ్లుండును. పువ్వువంటి యౌవనమునంతను ఎప్పుడో విష్ణువు వచ్చునని అంతవరకు దాచిపెట్టుదువా? నీవు దాచిపెట్టిన యౌవనమాగునా? కాక ఆ హరి యెవ్వడు? నాకంటె బలవంతుడా? నన్ను పెండ్లాడుము. మహారాణివై లోకము లేలుము' అని యామెను పట్టుకొనబోయెను. ఆమె లేచి 'ఛీ! దురాత్ముడా! అవాచ్య సంభాషణ కట్టిపెట్టుము. నీకును, విష్ణువునకును ఎక్కడిపోలిక? వృథా వదరకుము. నీవు నన్ను పట్ట దలచితివి, కాన మరుజన్మమునైన విష్ణువును చేపట్టి, నిన్ను ఊచముట్టుగా మట్టముచేసెదను.' అనుచు యోగాగ్నిలో భస్మమై పోయెను.

అంత నామెయే మరుజన్మమున లంకలో ఒక తామరపూవులో జన్మించెను. రావణుడు ప్రతిదినము నవకోటి శివాలయముల పూజించువాడు. ఒక నాడాతనికి వేదవతి యున్న పూవు దొరకినది. అది చాల బరువుగా నున్నందున

త్రుంపిచూచుసరికి కన్యక బయటపడినది. అక్కడివారంద రును, 'ఆమె నీకు మృత్యువగు'నని చెప్పుటతో నతడు ఆమెను పెట్టెలో పెట్టి సముద్రములో పడవేసెను. అది కొట్టుకొని వచ్చి, గట్టు జేరి, కప్పుపడి, జనకునికి నాగటిచాలులో దొరకినది. ఆ విష్ణుమూర్తికే నీవు. వేదవతియే సీతయై తన ప్రతిన నెర వేర్చుకొన్నది. అని అగస్త్యుడు చెప్పుటతో రాము డాశ్చర్య పడి 'రావణుడు క్రితము జన్మమునకూడ సీతను బాధించెనా? తరువాత ఏమి జరిగినది?' అని యడిగెను.

అగస్త్యుడు తరువాత కథ నిట్లు చెప్పదొడగెను. అంత నా రావణుడు భూసంచారము చేయుచు ఒకచోట యజ్ఞము జరుగుచుండగా 'అది యెవరిదో తెలిసికొనిరం'డని శుక, సారణాది భటుల నంపెను. వారు తిరిగివచ్చి, 'మరుత్తుడను మహారాజు యజ్ఞము చేయుచున్నాడ'ని చెప్పిరి. రావణుడు 'నేనుండగా దేవత లెట్లు హవిర్భాగములను తీసికొందురో చూచెదన'ని యజ్ఞశాలలోనికి ప్రవేశించెను. అంత ఇంద్రుడు నెమలిరూపు ధరించెను. యముడు కాకిరూపు ధరించెను. వరుణుడు హంసగాను, కుబేరుడు తొండగాను మారి, రావణునికి కనబడకుండ దాగికొనిరి. అంత రావణుడు లోపలికివెళ్ళి 'రాజా! నన్ను శరణువేడుము. లేకున్న ప్రాణములపై ఆశ వదలుము.' అని గద్దించెను. మరుత్తు డతనితో యుద్ధమునకై ధనుస్సు నెక్కుపెట్టబోయెను. అంతలో పురోహితుడు 'యజ్ఞ దీక్షలో మధ్యన యుద్ధము చేయరాద'నెను. అప్పు డాతడు వెనుకకు తగ్గెను.

రావణుడు తనకుతోచినట్లు యజ్ఞమును ధ్వంసము చేసి లేచిపోయెను. అతడు వెళ్ళినతర్వాత దేవతలు మామూలు రూపములను ధరించిరి. ఇంద్రుడు 'నెమలికి రంగురంగుల కన్నులు కలుగునట్లును, యముడు కాకికి ప్రేతరూపములో అన్నము తినునట్లును, వరుణుడు హంసకు పాలును, నీరును వేరు పరచునట్లును, కుబేరుడు తొండకు పలురూపములు కలుగునట్లును వరములిచ్చిరి. మరుత్తుడు యజ్ఞమును పూర్తిచేసెను.

తరువాత రావణుడు అనరణ్యుడను సూర్యవంశపురాజు మీదికి యుద్ధమునకు వెళ్ళెను. అతడెదిరించెను, కాని ఈడ కాలిని ఘాతికాగలేక నేలకూలెను. అప్పుడతడు 'నేను తాపసన్న, నా వంశములోనివాడైనను నిన్ను చంపు'నని శపించెను.

## రావణుడు బందీయగుట

ఆ కాలములో మాహిష్మతీపురమును కార్తవీర్యార్జునుడను రాజు పరిపాలించుచుండెను. అతనికి దత్తాత్రేయుని కృపవలన అణిమాదిశక్తులు కలిగినవి. అతనికి యుద్ధములో వెయ్యి చేతులు మొలిచెడివి. ఒకనాడతడు తన భార్యలతోకూడి నర్మదానదిలో జలక్రీడలాడుట కేగెను. అంతలో రావణుడు తన నెదిరింపగలిగిన రాజెవడాయని వెదకుచు, కార్తవీర్యార్జునుడు మహాబలశాలియని విని, మాహిష్మతికి వచ్చెను. అచ్చట నతనిమంత్రులు చక్రవర్తి జలక్రీడకు వెళ్ళినట్లు చెప్పిరి. అందులకతడు నవ్వి, 'నేనువచ్చుచున్నానని భయపడి ఆనువారితో స్నానము చేయుట కేగెనా? సరే! చూచెదను! అని కదలి సేనా

సముదాయముతో, వింధ్యాద్రిపై ప్రవహించు నర్మదకేగెను. అచ్చట స్నానముచేసి, ఆ శివపూజాధురంధరుడు వాలుకాలింగముచేసి, భటులను పూవులుకోసికొనిరమ్మని, శివపూజ చేయుచుండెను.

అంత ఆ ప్రదేశమున కెగువన కార్తవీర్యార్జునుడు భార్యలకు వినోదముగా తన వెయ్యిచేతులనుచాపి, నర్మద నాపుచేసెను. అది చిన్నప్రవాహముగా ప్రవహించుచుండెను. అంతలో నత డొక్కసారిగ చేతు లడ్డముతీయుసరికి, అడ్డుకట్టు తెగినట్లు ఒక్కసారిగ గట్టులుపొంగి ప్రవాహమువచ్చెను. ఆ ప్రవాహములో రావణాసురుడు పూజసేయుచున్న శివలింగము కొట్టుకొని పోయెను. రావణుడు ఆశ్చర్యపడి 'ఇదేమి? ఒక్కసారిగ ఇంతనీరువచ్చినది.' అనుకొని దానికి కారణము తెలిసికొని రమ్మని భటుల నంపెను. వారువెళ్ళి, వచ్చి 'రాజా! అతడు రాజో, దేవతయో కాని, వెయ్యిచేతులతో నర్మద నాపివేసినాడు. అంత మహాబలశాలి నింతవరకు మేమెక్కడను చూచియుండలేదు' అని అద్భుతముగా చెప్పుసరికి రావణుడు పూజానియమము మానివేసి, వెంటనే సేనలతో కార్తవీర్యార్జును డున్న వైపునకు బయలుదేరి వెళ్ళెను.

అతనిమంత్రులు 'మహారాజుగారు రాణులతో జలక్రీడలాడుచున్నారు. నీ వెవ్వడవు? ఇది మాట్లాడు సమయము కాదు.' అనిరి. రావణు డందులకు సహింపక 'అతడు వచ్చువరకు నే నాగను. రావణుడు యుద్ధమునకు వచ్చెనని తెలుపుడు' అనెను. వారు కోపించి 'ఈ భాగ్యమునకు మేము

చాలునమ్ము' అని యుద్ధమునకు సిద్ధపడిరి. కాని రాక్షససేనలు మిక్కుటమైన పరాక్రమముతో చెలరేగుసరికి రాజసేనలు తాళలేకపోయినవి. ఒకభటుండు వెళ్ళి చక్రవర్తితో ఈ సంగతి చెప్పెను. అప్పుడతడు గద చేతపట్టి యుద్ధభూమికి వచ్చెను. తన కడ్డువచ్చిన రాక్షసవీరులను తుత్తునియలు చేసెను. ఆ తాకిడితో రాక్షససేన వెనుక మొగముపట్టినది. అప్పుడు రావణుడు కార్తవీర్యునిపైకి కలియబడెను. ఇద్దరును ఘోరముగా గదాయుద్ధము చేసిరి. ఆ యుద్ధమున రావణుడు మూర్ఛపోయెను. కార్తవీర్యు డతనిని ఇంటినారితో కట్టివేసెను. అతనిపాటు చూచి ప్రహస్తాదిమోఘవీరులు కార్తవీర్యుని కడ్డు తగిలిరి. రావణునే నొప్పించిన వానికి తక్కిన రాక్షసు లొక లెక్కయా? వారందరును పికాపికలై పారిపోయిరి. అప్పుడు కార్తవీర్యార్జునుడు రావణుని, భటులచే పట్టించి, చెరసాలలో వేయించెను. తా నంతఃపురమున కేగి సుఖముగా కాలమును వెళ్ళించుచుండెను. ఆ యూరిప్రజలెల్లరు ఖైదుదగ్గరకు వచ్చి, రావణుని చూచి 'ఒడలు తెలియక కండకావరముతో ఎందరిని బాధించినావు? అది యూరకపోవునా? ఇప్పు డనుభవించుచున్నావు' అని తిట్టుచుండ దీనవదనుడై అతడక్కై ఖైదులో దుఃఖించుచుండెను. ఏ కాలమున కే గతి పట్టునో, ఎవరును చెప్పలేరు కదా! దిక్పాలకులను తల్లడిల్ల చేసిన రావణాసురుడు ఒక్క మానవమాత్రునకు లోబడి ఖైదులో పడెను.

అంత కొన్నాళ్ళకు పులస్త్యబ్రహ్మ తన మనుమడు ఖైదులో పడినట్లు తెలిసికొని మాహిష్మతికి వచ్చెను. ద్వార

పాలకులవలన పులస్త్య బ్రహ్మవచ్చినట్లు తెలిసికొని కార్తవీర్యా ర్జును డతని కెదురేగి, అర్ఘ్యపాద్యాదులిచ్చి, సుఖాసనాసీనుని చేసి, వచ్చినపని యడిగెను. అతడు 'మహారాజా! నీవు నిరుప మాన బలశాలివి. నా మనుమడు బలగర్వితుడై నీమీదికి వచ్చినందుకు తగినశాస్తి చేసితివి. నా ముఖముచూచియైన అతనిని వదలుము. నే నందులకే వచ్చితిని.' అని చెప్పుటతో అత డంగీకరించి అగ్నిసాక్షిగా రావణునితో స్నేహము చేసి అతనిని వదలెను.

## వాలి రావణుని గర్వభంగము చేయుట

అతనిది కుక్కబుద్ధి. ఎన్ని పరాభవములు జరిగినను తన గర్వమును విడునడు. భుజములకు మరల తీట కల్గినది. అది తీర్చుకొనుట యెట్లా? అని వాలి మహాబలశాలి యని, అతనితో పట్టుపట్టుటకై కిష్కింధ కేగెను. అప్పుడతడు ద్వార మందున్న తారుని అడిగెను. అంత నాతడు 'నీవు ఎరిగి వచ్చి తివో, ఎరుగకవచ్చితివో కాని ఇతనితో యుద్ధముచేసి యెవరును తిరిగి వెళ్ళలేరు. అదిగో చూడుము; ఆ యెముకలగుట్ట. అది ఆ హతవీరులదే. ముందే యోచించుకొనుము.' అనెను. దానికి రావణుడు నవ్వి, 'వానరరాజైన వాలిబలము నాకు చెప్పనక్కరలేదు. అత నెక్కడ నుండెనో చెప్పుము' అని గర్జించెను. అంత తారుడు 'వాలి దక్షిణ సముద్రమునకు స్నానమునకు వెళ్ళినాడు. అచ్చటకు వెళ్ళుమ నినాడు. రావ

ణుడు భుజాకంఠాతి నాపుకొనజాలక దక్షిణ సముద్రతీరమునకు వెళ్ళి వాలిని చూచి యాశ్చర్యపడెను.

అతడు చాల భయంకరముగ నున్నాడు. అతడు మహా బలశాలిగా కన్పడుచున్నాడు. ఎదుట పడుటకన్న చాటుగా అతనిని పట్టుకొన్న బాగుండునని తలచి, మెల్లగా తప్పటడుగులు వేసికొనుచు, వెనుకవైపునుండి వెళ్లెను. వాలి అది గమనించినను తెలియనట్లూరకొని, దగ్గరగా వచ్చునసరికి అతనిని చంకలోపెట్టి నొక్కివేసెను. మామూలుగా తన అనుష్ఠానములు నెరవేర్చుకొని అతనితోసహా పడమట సముద్రమున కెగిరిపోయెను. అది చూచి ప్రహస్తాదులు భయమందిరి. వారేమి చేయగలరు? పశ్చిమ సముద్రములోను, ఉత్తర, పూర్వసముద్రములలోను తనతోపాటు రావణునికూడ ముంచి చివరికి కిష్కింధకు తీసికొనివచ్చి క్రిందపడవేసెను. ఈలోపులో అతడు చంకలోనుండి పిల్లి పిల్లలాగున నలిగిపోయెను. వాలి అప్పుడే అతనిని చూచినట్లు 'ఓహో! రావణాసురులా! ఎప్పుడు వచ్చినారు? వచ్చినపనియేమి?' అనెను. రావణుడు బ్రతికిబయట పడితినని పునర్జన్మనందినట్లు సంతోషించుచు, 'వానరోత్తమా! నీ వింత బలశాలి వనుకొనలేదు. నీకు చెలగాటముగా నున్నది, కాని నాకు ప్రాణముకడంటినది. నిన్ను గెలువ నేనెంతటి వాడను. దయయుంచి నన్ను మన్నింపుము. నన్ను నీ స్నేహితునిగా స్వీకరింపుము' అనెను. అందులకు వాలి అంగీకరించెను. తన యింటివద్ద రావణునకు ఒక నెలరోజులు విందు చేసెను. తరువాత రావణు డింటికి వెళ్ళిపోయెను.

# రావణవిజయము

తరువాత నొక్కనాడు నారదుడు రావణునింటికి వచ్చెను. అతడామహర్షికి ప్రత్యుత్థానాభివాదనములుచేసి గౌరవించెను అంత నారదుడు 'రాక్షసేంద్రా! నీవు మనుజులమీదికి పోకుము. నరివారితో కలహించినెగ్గుట కీర్తికరము, కాని నరులు, వానరులు నీకొక లెక్కయా? వారు నీదృష్టికి సగాక్ష్మజీవులు. కావున నీవు వారిజోలికి పోకుము. యుద్ధము చేయ కోరికకలిగిన రసాతలమున కాలకేయ, నివాతకవచులను రాక్షసులున్నారు. యముని పట్టణమగు సంయమనీ నగరమునకువెళ్ళి, యముని జయించి. ఆ దారిని రసాతలమున కేగుము. దాననీకు కీర్తికల్గును' అని చెప్పెను. రావణు డదివిని 'మునీంద్రా! నీకు మానవులపై ప్రేమయెక్కువ. వారిని రక్షించదలచి, అట్లుచెప్పితివి. కానిమ్ము నా కెదురుతిరుగనంతవరకు వారినట్లే వదలివేయుదును. ఇప్పుడు నీవుచెప్పినట్లు యమునిజయించి రసాతలమున కేగెదను' అనెను. నారదుడు 'మీ రిద్దరియుద్ధము కన్నులారచూచి కడుపునింపు కొందును. ముందుగా నేనువెళ్ళి యమధర్మరాజున కీ విషయము చెప్పెదను.' అని యక్కడనుండి బయలుదేరి సంయమనీ నగరమున కేగెను.

యమధర్మరా జతనికి స్వాగతమిచ్చెను. 'విశేషము లేమి?' అని యడిగెను. నారదమహర్షి 'రావణాసురుడు కన్ను గానక నీపైకే దండెత్తదలచినాడు. అతనికి నీశక్తి తెలియదు. ఒక్కసారి చవిచూపుము.' అని పురికొల్పెను. యముడంత చిట్టు'మని 'ఏమీ! అతని పోతరము. రానిమ్ము. మదమడచెదను.'

అని యుద్ధసన్నద్ధుడై యుండెను. నారదుడు తనువచ్చినపని సఫల మైనదని వారి యుద్ధముచూడగోరి యచ్చటనే యుండెను. అంతలో రావణునిసేనలా ప్రాంతమునకు వచ్చినవి. యమ దూతలు తమప్రభువునకా వార్తను విన్నవించిరి. అతడు ముందుగా తనదూతలను యుద్ధమునకు నియోగించెను. కాని వారెవ్వరును రాక్షసవీరుల ధాటి కాగలేకపోయిరి. అప్పుడింక యమధర్మరాజే యుద్ధభూమికి వచ్చెను. యమ రావణులకు ఘోరముగా యుద్ధము సాగుచున్నది. రావణుని గెల్చుట అసాధ్యమనితోచి యముడు అమోఘమైన ప్రయోగముకల్గిన శక్తిని ప్రయోగింపబూనెను. అంత బ్రహ్మదేవు డచ్చటికివచ్చి యమునితో 'నాయనా! నీవు మహాబలశాలివి. శక్తియమోఘ మైనది. రావణునకు నేను వరమునిచ్చియున్నాను. అది వృథా పోకుండ నీశక్తి నుపసంహరించుకొనుము. నామాట వినుము. ఇతడు నిన్నేమియు చేయజాలడు.' అని చెప్పుటతో నాతడు బ్రహ్మమీది గౌరవముతో యుద్ధభూమినుండి అంతర్ధానమై పోయెను. బ్రహ్మయు అంతర్ధాన మయ్యెను

అంత రావణుడు, యముడు తనకు లొంగిపోయెనని చాటించుకొనెను. కన్నుగానని వారల బీరములిట్లే యుండును. నిజమెట్లున్నను వారి కనుకూలముగా వారు చాటుకొనుచుం దురు. అతని మాటను కాదనువా రెవ్వరు? అతడేమనుకొనినను నష్టమెవరికి? అతడచ్చటినుండి పాతాళమునకేగెను. అచ్చట భోగవతియను పట్టణమును చుట్టుముట్టెను. అంత వాసుకి ప్రముఖులైన నాగేంద్రులు కానుకలుతెచ్చి అతనిని శరణు

జొచ్చిరి. అత డా కాన్కలనందికొని వారల క్షమించి వదలి వేసెను. అచ్చటినుండి మణిమతి కేగి నివాతకవచులపైకి దండె త్తెను వారు అతనిని లెక్కసేయక యుద్ధమునకు సిద్ధమైరి. ఉభయపక్షములవారికిని హోరాహోరి పోరు పంద్రెండుమాసములు జరిగినది. అంత బ్రహ్మవచ్చి 'రాక్షసులారా! మీ రితనిగెలవజాలను దుర్జేయుడే. మీకీ పోరేల? చాలింపుడు. సఖ్యముచేసికొని సుఖింపు'డని హితవుచెప్పెను. వారట్లే నడచుకొనిరి.

రావణు డచ్చటినుండి అశ్మకపురమున కేగెను. అది కాలకేయులకు రాజధాని. విద్యుజ్జిహ్వుడు, శూర్పణఖమగడు దానికి నాయకుడు. పదిమందితోపాటతడును యుద్ధమునకు వచ్చెను. రావణుడా సందడిలో అందరితోపాటుగా నతనిని చంపివేసెను. అచ్చటినుండి వరుణుని నగరమున కేగెను. అచ్చట లోనికేగు సరి కతనికి వేల్పుటావు కన్పడినది అతడు దానికి ప్రదక్షిణముచేసి నమస్కరించి లోనికేగెను. అంత వరుణునిసుతులు యుద్ధమునకు వచ్చిరి. కాని కొంచెము సేపటిలో వారు పోరసల్పలేక పారిపోజొచ్చిరి. అప్పుడు రావణుడు 'ఛాఛా! మీరెంతయో బలవంతులని వచ్చినాను. కాని యింత నీరు కారుదురని అనుకొనలేదు. కానిండు క్షమించితిని. పొండు పరుగెత్తువానిని చంపుట నావని కాదు.' అనుటతో వారు 'మా తండ్రి యూరలేడు. వచ్చినను అతడుకూడ నీకెదురు కాలేడు. అతనినికూడ నీ స్నేహితునిగా తలంచుకొనుము. మరలిపొమ్ము' అనిరి.

# రావణుడు బలిచక్రవర్తిని చూచుట

అంత రావణుడు వారిని గెల్చినట్లు చాటించి బలిచక్రవర్తిని గెల్చు నుద్దేశ్యముతో సుతలమున కేగెను. అచ్చట ముందుగా ప్రహస్తాదిమంత్రులు లోనికేగిరి. ఆసువాకిళ్ళుదాటి ఏడవవాకిలి చేరుసరికి వారికొక దివ్యపురుషుడు కన్పడెను. అతడట్టహాసము చేయుసరికి వారు హడలిపోయి తిరిగివచ్చిరి. రావణుడ దేమని యడుగ 'అమ్మో! అక్కడ నొక విచిత్రవ్యక్తి యున్నాడు. అతని నవ్వునకే మాకు భయము వేసినది.' అని విస్తారముగా చెప్పగా 'నేను చూచెదనని' అతడు లోనికేగెను.

ఏడవవాకిలిలో వారన్నట్లు దివ్యపురుషు డొక్కడున్నాడు. అతడు చాల భయంకరముగా నున్నాడు. యముడు కూడ అతనిలో శతాంశము బోలడు. ఇదివర కాతడెన్నడు నట్టి భయంకరమూర్తిని చూచియుండలేదు. అతని చూచుసరికి భయపడి, సంబాళించుకొని నిలువబడెను. ఆ దివ్యపురుషుడు 'నీవెవ్వడవు? ఏమి పనిమీద వచ్చితివి?' అని యడుగ 'నేను బలి దైత్యేంద్రునితో యుద్ధము చేయవచ్చితిని.' అనగా నతడు పకపకనవ్వి 'నీవా? బలిచక్రవర్తితో యుద్ధము చేయువాడవు? అతడు మహాబలశాలి. చూడవలెననియున్న చూడుము. లోనికేగుము' అని త్రోవయిచ్చెను అతడు లోనికేగెను. అక్కడ బలిచక్రవర్తి సింహాసనాసీనుడైయున్నవాడు. అతని చూచి చేతులు తరచుకొని నిలువబడు సరి కతడు రావణుని చూచి 'రావణా! ఇటురమ్ము. ఇక్కడ కూర్చుండుము' అని ఆసనముపై కూర్చుండబెట్టి 'మీ వారందరికి క్షేమమా?

ఏమి యిటు వచ్చితివి?' అని అడిగెను. దాని కతడు 'బలీంద్రా! నిన్ను విష్ణువు బంధించెనని విన్నది మొదలు నా హృదయము బాధపడుచున్నది. విష్ణువునకై వెదకితిని. అతడు నాకెక్కడను కానరాలేదు. నిన్ను విడిపించుటకై వచ్చినాడను' అనెను. అది విని బలిచక్రవర్తి 'ఓయి వెఱ్ఱివాడా! నీవా విష్ణుని గెల్చువాడవు? ఆ ద్వారము నున్నవాడే విష్ణువు. అతనిని చూచుసరికే నీ ప్రాణము దడదడలాడెనే? మా ముత్తాతయు (హిరణ్యకశిపుడు) నిట్లే భగవంతుడెందుండెనని కొడుకును భర్త్సించగా విష్ణువు సర్వాంతర్యామియై నృసింహావతారమున నతని చంపినాడు. అతడు మహాబలశాలి. సర్వాంతర్యామి. నీ బాహుబలమునకు లొంగెడివాడు కాడు. వచ్చినదారిని వెళ్ళుము. బుద్ధికల్గి ప్రవర్తించుము' అని బుద్ధిచెప్పి పంపించెను. అతడీవలకు వచ్చుసరికి ద్వారమున నెవరును లేరు. ప్రహస్తాదులతో విష్ణువు, బలిచక్రవర్తియు తనకు లొంగి, తనను శరణు వేడిరని చెప్పి అక్కడనుండి కదలెను.

అక్కడినుండి హిమవంతమునకువచ్చి, గంధమాదన కైలాసపర్వతములు దాటి మేరుపర్వతమున కేగెను. సూర్యుడు దాని చుట్టును ప్రదక్షిణము చేయుచుండెను రావణుడు సూర్యలోకమున కేగి అచ్చటివారితో 'రావణుడు యుద్ధమునకు వచ్చెను. యుద్ధమునకువచ్చునో? ఓడితినని యొప్పుకొనునో? మీ సూర్యునడుగుడు' అని కబురంపెను. వారు లోనికేగి సూర్యునితో అతనిమాటలు చెప్పిరి. అతడు 'మనకు ప్రతి దినము నడ్డువచ్చు మందేహాది రాక్షసులు చాలక ఇతడొకడా?

ఓడిపోయినని చెప్పెను ఇంతలో మరలవచ్చిన పౌరుష భంగ మేమియులేదు.' అనెను ఆమాట వినుసరికి రావణునకు మరింత గర్వము హెచ్చినది ఉబ్బుచు, సూర్యుడు నా కోడిపోయెనని కేకలువైచుచు ఇంకను ఊర్ధ్వలోకముల కేగుచుండెను.

అంతలో పర్వతుడను ముని యెదురై అతనికి పుణ్య లోకములలో సుఖించువారినిచూపి చెప్పెను. అంతయు విని 'వారితోల నాకేల? ఇక్కడ నాతో యుద్ధముచేయువా రెవ్వ రైన నున్నారా?' అని యడిగెను అంతనతడు 'మాంధాత' యను చక్రవర్తి యున్నాడు. అతడు నీతో పోరగలడు. తక్కినవారికి సుఖము లనుభవించుటయే కాని యుద్ధములతో పనిలేదు.' అని చెప్పెను. అతడు వెడలిపోయెను. అంతలో మాంధాత రథముపై ఆ దారికే వచ్చుచుండెను. అతని కెదురేగి రావణుడు 'నాతో యుద్ధముచేయుము' అనెను అతడును 'నాతో నింత వరకు పోరెదనన్న వీరుడులేడు. రమ్ము. నీ కావర మణగించెద' నని విల్లెక్కుపెట్టి శరవర్షము కురిపించెను రావణుడును వాటి నన్నింటిని మధ్యనే నరికివేసి బాణము వేయుచుండెను. చిట్ట చివరి కిద్దరును మహాకోపావిష్టులైరి. మాంధాత బ్రహ్మాస్త్ర మును సంధించెను రావణుడు పాశుపతాస్త్రమును సంధిం చెను. అంతలో బ్రహ్మవచ్చి 'వీరులారా! మీరిద్దరును మహా పరాక్రమశాలురే. మిమ్ముల గెల్వగల వీరుడులేడు. మీరు మహాస్త్రములు ప్రయోగించి లోకక్షోభము కల్గజేయకుడు. అస్త్రముల నుపసంహరించి మైత్రికల్గి ప్రవర్తింపుడు.' అనెను. వారిద్దరు నతనిమాట పాటించి మిత్రులైరి.

అచ్చటనుండి రావణుడు చంద్రలోకమున కేగెను ఆ మండలమున చలి మిక్కుటమై రాక్షసవీరుల బాధించినది. రావణుడది సహింపలేక చంద్రునిపైకి ఆగ్నేయాద్యస్త్రములు వేయ నుంకించెను. అంతలో బ్రహ్మదేవుడు మరల వచ్చి 'రావణా! ఇతడు జలస్వరూపుడు. చలివేయుట ఇక్కడ ప్రకృతి. అంతేకాని నిన్ను బాధింపదలచికాదు. నీవు వెడలిపొమ్ము. ఇతనిపై అస్త్రముల వేయరాదు' అనెను. రావణు డందుల కంగీకరించి అక్కడినుండి వెడలిపోయెను.

ఇక అతనియెదుట నాగగలిగినవారెవ్వరు నాతని కగపడ లేదు. వచ్చెడిదారిలో అందమైన స్త్రీలనెల్ల పట్టి తెమ్మని భటుల కాజ్ఞాపించెను. వారు ఎంత దాగినను, పెద్దవారి ప్రక్కలకొదిగి నను అడ్డమువచ్చినవారినెల్ల తెగచంపి సుందరమైన స్త్రీల నెందరినో పట్టి తెచ్చిరి. దానికా దేవతాస్త్రీలు సైపజాలక అందరు నేకముఖముగా 'మేము మహాపతివ్రతలమేని మమ్ము నిర్బంధిం చిన ఈ రాక్షసుడు స్త్రీ మూలముగా చచ్చుగాక! మావారిని చంపినట్లే ఇతనిని శత్రువులు చేతులు తెగగొట్టి చంపగా, మా వలెనే ఇతనిభార్య లేడువుగావుత!' అని శపించిరి ఎన్ని శపించి నను, ఏడ్చుచున్నను, సిగ్గెగ్గులులేక రావణుడు వారినెల్ల తీసికొని లంకకుచేరెను.

అంత శూర్పణఖ 'అన్నా! ఇదా నీవుచేసిన ఘనకార్య ము? నీమరదిని చంపి నన్ను విధవనుచేసినావు. నేనెట్లుభరింతు' నని అతనిముందు ఏడుపారంభించినది. అతడామెతో 'నేను గమ నించలేదు. అతడు నాతో యుద్ధమునకు తలపడినాడు. అంద

రితోపాటతనిని చంపినాను. శిశువునచూచి ఎంతో విచారించి తిని. కాని ఏమిలాభము? విచారింపకుము. ఖరుడుమామయుడు, త్రిశిరస్కుడును తోడురాగా మరి పదునాల్గువేల రాక్షసులతో నీవు దండకారణ్యమున విహరింపుము. నీకు కావలసినవస్తువుల నెల్ల తీసికొనిపొమ్ము.' అని ఆమెనోదార్చి దండకాటవిలోని జనస్థానమున కంపెను.

నగరునకు వెళ్లసరికి ఇంద్రజిత్తు నికుంభిలలో తపస్సు చేయుట కేగెనని చెప్పిరి. అంత వెంటనే రావణుడు నికుంభిల కేగెను. అప్పుడే మేఘనాదుని వీరమాహేశ్వర క్రతువు పూర్తి యైనది. అతడు తండ్రికి నమస్కరించెను. రావణుడతని కౌగి లించుకొని పుత్రగాత్రపరిష్వంగ సుఖమునందెను. అప్పుడు శుక్రాచార్యుడు 'రావణా! ఇతడగ్నిష్టోమాది క్రతువు లన్నియు చేసినాడు. ఈశ్వరు నుద్దేశించి వీరమాహేశ్వర క్రతువుచేసి కృతకృత్యుడైనాడు. ఇక నితని కడ్డులేదు. అజయ్యుడైనాడు. ఈశ్వరునివలనఇతడు'కామసంచారము,నదృశ్యమునగురథమును, అక్షయతూణీరములను, విల్లును, 'తామసి' యను మాయను పొందెను.' అని అతని వరలాభములనూర్చి చెప్పెను. తానిక నతని సాహాయ్యంబున ఎన్నియో కార్యములు సాధింపవచ్చు నని రావణుడు తలచెను. పైకి 'మంచిదే. బాగున్నది. మీ దయవలన మావాడంతవాడైనాడు' అని చెప్పి ఇంటికి చేరెను.

పరాంగనల దీసికొని యింటికిచేరిన రావణునితో విభీష ణుడు 'అన్నా! ఎంతపనిచేసితివి? వీరందరినెందులకు తీసికొని వచ్చితివి? నీ కిక్కడ భార్యలే లేరా? వీరినందరిని జాగ్రత్తగా

చూచిన చాలదా? ఎవడెట్లు చేయునో వానికట్లే సంఘటించు నన్నది రిత్తకాదు. నీ వితరుల దీసికొనిరాగా, ఇక్కడ లంక నంతను ఒకకడకు తెచ్చి మధువను రాక్షసుడు మన చెల్లెలినెత్తు కొనిపోయినాడు. అతనిమీద నీవింక కోపపడవలదు. అయిన దేదో అయిపోయినది. ఇప్పుడతని చంపినంతమున లాభమేమి? అతడు వచ్చునరికి నేను సముద్రములో మునిగి సమాధిలో నున్నాను. ఇంద్రజిత్తు యాగములో దీక్షితుడైయున్నాడు మన కుంభకర్ణుడు సరేసరి నిద్రయేకదా! ఇంకెవ్వరున్నారు రక్షకులు? ఈ సందు కనిపెట్టి అతడు లంకమీద పడినాడు పోనిమ్ము. వీరల వదలిపెట్టుము' అని నీతులు చెప్పెను. రావణుడగ్గిమీద గుగ్గిలమై 'విభీషణా! నీ నీతులు కట్టిపెట్టుము. ఎవ్వరును లేక పోయినంతమాత్రాన భయము భక్తియు లేకుండ విచ్చల విడిగావచ్చి మధువు లంకను దోపిడిచేయునా? అట్టివాని నూర కొనరాను. ఇప్పుడే వెళ్లుచున్నాను. వాని పని తేల్తును.' అని క్రోధమూర్తియై ప్రహస్తునితో లంకకు కొందరిని కాపుపెట్టు మని నియమించి ఇంద్రజిదాదులతో బయల్దేరి మధుని పట్ట ణము మీదికి దాడివెడలెను.

అంత నతని సంరంభమువిని కుంభీనస (రావణునికి చెల్లెలి వరుసలోనిది) అన్నగారి కోపమడచునని తానొక్కతెయేవచ్చి వలవల యేడ్చుచు రావణుని పాదములపైబడినది. అతడామెను లేవనెత్తి 'అమ్మాయీ! నీకు వచ్చిన ఆపద ఏమియులేదు. ఏడీ? మధువెక్కడనున్నాడు?' అని అడుగుటతో 'అన్నా! నా కేమియు ప్రమాదములేదు. మధువు నన్ను బలాత్కారముగా

తెచ్చినమాట నిజమే కాని తెచ్చినాక అతడు నాకు భర్తయై నాడు. నేమిద్దరమును పరస్పరానురాగముతో మెలగుచున్నారము. ఇప్పుడు నీ వాతని చంపిన నేను భర్తలేక యెట్లు జీవింప గలను? నాకై అతని రక్షింపుము.' అని వేడుటతో అతడు దయకలిగి 'అమ్మాయీ! నీవింతగా చెప్పినప్పుడు నే నతని నేమియు చేయ్యనులే. ఇప్పుడు నేనింద్రునిపైకి దాడికి వెడలు చున్నాను. అతనినికూడ రమ్మనుము. మాకు తోడగును.' అని అభయమిచ్చెను.

అప్పుడామె అంతఃపురమునకేగి ఈ సంగతేమియు తెలియక గుర్రుపెట్టి నిద్రించుచున్న మగని లేపి 'మా అన్న, రావణుడు ఇంద్రునిపైకి దాడివెడలుచు, నిన్ను సాయముగా తీసికొని వెళ్లుటకై వచ్చినాడు. లెండు' అని లేపి చెప్పినది. అతడులికిపడి లేచి రావణునకెదురేగి అర్ఘ్యపాద్యాదులిచ్చి బంధుమర్యాదలు నడపెను. అతడును యోగక్షేమము చేసి అతని యింటివద్ద ఒక్కరోజాగి మరునాడు స్వర్గమునకు బయల్దేరెను.

రాక్షససేనలు హుటాహుటి నడకలలో స్వర్గమునకు బయల్దేరినవి.

## ఇంద్రజిత్తు ఇంద్రుని జయించుట

రావణుని సేనలు సాయంత్రమగుసరికి కైలాసమునకు దగ్గరగా వెళ్లినవి. అక్కడనే ఆ పూటకు సేనలు విడిసినవి. అంత ప్రొద్దుగ్రుంకుటతో చీకటు లావరించినవి. కొంచెము సేపగుసరికి చంద్రోదయమైనది. మన్మథుని కీర్తివలె వెన్నెలలు నలుదిక్కుల వ్యాపించినవి. పగలు కాసిన యెండకు అప్పటి

వెన్నెలకు సరిగా సరిపోయినది. ఆ వెన్నెలయే లేకున్న పగటి యెండకు ఓషధులన్నియు మాడిపోకుండునా? ఎండకు వాడిన తీగలు తలలెత్తినవి. ఉత్సాహవంతులైన కామినీ కాముకులు ఒడలు తెలియక కేళీవిలాస లోలురైనారు. అట్టితరి రావణు డొంటరిగా నున్నాడు. అతనికి విలాసినులు లేకుండ ఒక్క-క్షణ మైనను గడువదు. ఇక వెన్నెలరాత్రిలో అతడు పడుబాధ దేవుని కెరుక.

సేనలను విడచి అతడు కొండమీదికి విహారమున కేగెను. అప్పుడే విడిచిన మొగలిపూలు గుబాళించుచున్నవి. మల్లెలు, మొల్లలు సువాసనల వెదజల్లుచున్నవి. చెంగల్వ పుష్పాదుల గ్రహించి, చల్లని పిల్లవాయువులు సరస్సులపైనుండి వచ్చిన శరీరమునకు సోకుచున్నవి. ఆ విరహసమయమున రావణున కవన్నియు బాధాకరములైనవి. ఏమియు తోచక అతడిటు నటు తిరుగుచుండెను. బ్రహ్మదేవు డెవతెనైనను తనవద్దకు పంపిన బాగుండునని తలచుచుండెను.

అప్పుడు రంభ శుభ్రముగా పన్నీట జలకమాడి తెల్లని వలువలు కట్టుకొని పైఠాణీశాలువ మేలుముసుగు వేసికొని, పుష్పాసవముల (అత్తరు) పూసికొని గంధపు మైపూతలలందు కొని నలకూబరునికై బయల్దేరినది. ఆమెకు వచ్చుదారిలో రాక్షససేనల సందడి వినబడినది. అటు పోయినచో వారు తన్ను కదలనీయరని తప్పించుకొనిపోవలచి రావణుడున్న వనప్రాంత మున కేగెను. ఆ పూలవాసన గుబాళించుసరికి రావణునకు ప్రాణము లేచివచ్చినది. పరికించిచూచెను. వనితామణి యొర్తు

తనవైపే వచ్చుచుండెను. తన చేతలు ప్రసన్నులైరని రావణుడు బ్రహ్మానందభరితుడయ్యెను. అతనిని చూచుసరికే రంభ కనులంటె లాగిపోయినవి. వెనకి వెడక తప్పించుకొనబోయి పులియున్న పొదలోకి వచ్చు లేడిపిల్లలాగున తా నతని యెదుటనే పడినది. ఇంక తప్పించుకొనుటకు వీలులేదు అతడామెను గుర్తించి తన్ను కౌగలించి ఆనందపరుపు మనెను.

రంభ ధైర్యముతో "మామా! నేను నీకు కోడల నగుదును. కోడలు కూతురితో సమము గదా! నన్ను పట్టుట నీకు న్యాయమా? నీ వెరుగని శాస్త్రము లేవి యున్నవి? నన్ను పోనిమ్ము' అన్నది. రావణుడు నవ్వుచు 'ఓసీ! ఎంత నీతిమంతురాలవైనావు! నీకు వావివరుసలుకూడ నుండెనా? యజ్ఞము చేసినవారికి నీవు భోజ్యవే కదా! తండ్రీ కొడుకులు యజ్ఞము చేసినపుడు వారికి నీవేమగుదువు? బావ, మరదులు వీరస్వర్గము నలంకరించినచో వారికి నీ వేమగుదానవు? నీ నియమములు నాకు చెప్పకుము' అని యెముడిసిపట్టి తనకోరిక తీర్చుకొనెను. ఆమె అబల. ఏమి చేయగలదు? పిల్లికి చెలగా టము; ఎలుకకు ప్రాణసంకటము నైనది.

ఆమెకై నలకూబరుడు నిరీక్షించుచున్నాడు. ఇంకను రంభ రాలేదేమా? ఏల యీ రాత్రి తడసెనో? అని యతడు తబ్బిబ్బులగుచుండెను. అంతలో చెదరిన ముంగురులతో నీడిన పూలమాలలతో, చీకాకుపడిన ముత్యాలసరులతో కన్నీరుమున్నీరుగా కార్చుచు రంభవచ్చెను. ఆమెనుచూచి అతడు 'ఇదేమి ? ఏమి జరిగినది ?' అని ఆతురతతో అడిగెను.

ఆమె జరిగిన యవమానము నంతను చెప్పినది. ఆమె కిష్టము లేనందున అదంతయు నామె కవమానమైనది. మంచిచెడ్డలు ఇష్టానిష్టములలో నివే కదా! నలకూబరు డెంతో విచారించి వెంటనే దానికి ప్రతీకారము చేయనెంచి మంచముదిగి గంగోదకము చేతబూని 'ఇకపై నెవ్వడైనను తన్ను వలువని కాంతను బలాత్కరించినచో రావణుని తలలు వేయివ్రక్కలగుగాక!' అని శపించెను. అందుల కందరును సంతసించిరి. పెద్దవారికి కష్టములు కలిగినపుడు కాని బీదల కష్టములు తగ్గవు. అది విని రావణుడు చేయి విరిగినట్లు ఇక నెవరిని బలాత్కరించుట మానెను.

మరునాడుదయమునసే సేనలు దేవతానగరమును చేరినవి. రావణుడు చుట్టుముట్టుమనియాజ్ఞాపించెను. వెంటనే సేనలు అమరావతిని ముట్టడించినవి. ఈ వార్తను భటులింద్రునితో చెప్పిరి. అతడు బ్రహ్మ రావణునకిచ్చిన వరములకుజంకి విష్ణుమూర్తిని తలచుకొనెను. అతడు ప్రత్యక్షమై 'దేవేంద్రా! ఇది రావణునకు మంచికాలము. నేనగపడుట కిది సమయముకాదు. విష్ణువువచ్చి యోడిపోయెననుటకంటె నేను రాకుండుటయే మేలు. నేను కాలాంతరమున, రామావతారమున అతనిని చంపుదును. ఇప్పటికి తగినట్లు నీవేచూచుకొనుము.' అనెను. అంత ఇంద్రుడు సేనలను సమకూర్చుకొని రావణునిపైకి యుద్ధమునకేగెను. దేవదానవులకు ఘోరయుద్ధము జరిగినది. వారెల్లరు మహోత్సాహముతో నున్నందున నిరుత్సాహులైన దేవతలను తరిమివేసిరి. ఇంద్రుడు బ్రహ్మ వరబలముచే రావణు

డవధ్యుడైనను పట్టి బంధింపవచ్చునని ప్రతిజ్ఞపట్టి అతనితో కలియబడి పాశబద్ధుని చేసెను.

ఆవార్త తెలియుటకు మేఘనాదుడు క్రుద్ధుడైనాడు ఇంద్రునిపైకి కలియబడినాడు. రథమునగపడకుండ శరవర్షము కురిపించుచొచ్చెను. ఇంద్రునకు యుద్ధమంతయు నగమ్యగోచరమైనది. తన మాయనంతను ప్రయోగించి యింద్రుని పాశములతో కట్టివేసెను. అప్పుడు మేఘనాదుడు నవ్వుచు 'నాతండ్రిని కట్టబోయి నీవే కట్టుబడితివి. ఇంకెక్కడికి పోదువు? రమ్ము. మా లంకావాసము చేయుదువుగాక!' అని అతని భటులచే పట్టించుకొని తండ్రిని విడిపించి లంకకుచేరెను. ఆ కొడుకును కౌగలించుకొని రావణుడు మురిసిపోయెను, ఇంద్రుని తీసికొని పోయెనని దేవతలు బ్రహ్మతో మొరపెట్టగా అతడు లంకలోనికి వెళ్లెను. అతనికి తండ్రీ, కొడుకులు స్వాగతమిచ్చి పూజలు చేసిరి. అప్పుడతడు మేఘనాదునితో 'వత్సా! నీ పౌరుషమునకు మెచ్చితిని. ఇంద్రునను నేనే పట్టముకట్టినాను. అతనిని నీవు దింపరాదు. వదలివేయుము. నీ 'కింద్రజిత్తు' అను బిరుదమునిచ్చుచున్నాను వరము కోరుకొమ్ము ఇచ్చెదను' అనెను. అంత ఇంద్రజిత్తు పరమానందభరితుడై 'పరమేష్ఠీ! నీ కరుణ కల్గిన నా కేమిటను కొదువకల్గదు. నీవు చెప్పినట్లు ఇంద్రుని వదలుదును. నా కమరత్వమిమ్ము' అనెను. బ్రహ్మ 'వత్సా! దేవ గంధర్వాదులకే అమరత్వములేదు. నీకెట్లిత్తును? మరియొక వరము కోరుము' అనెను. అందరును పుణ్యములచేసి అమరులు కాగా నేను పౌరుషముతో అమరుడనగుదును. యుద్ధము వేళ అగ్నిలో

హోమము చేసి అందుండి వచ్చిన దివ్యరథమెక్కినప్పుడు నాకు చావులేనట్లు వరమిమ్ము. అట్లు రథమును పొందకపోయిన పోవుగాక!' అని కోరగా బ్రహ్మ అట్టే అని వరమొసంగి ఇంద్రుని విడిపించి 'నీకు కాలము మంచిదికాక ఇట్లైనది. అందుల కేమియు విచారింపవలదని యూరార్చి స్వర్గమున కాతనిపంపి తాను నిజ లోకమున కేగెను. అంత బలశాలియగు నింద్రజిత్తును చంపి నందులకు లక్ష్మణునందరును స్తుతించిరి.

## కపిలమహర్షిని చూచి రావణుడు భంగపడుట

అంత అగస్త్యుడు 'రామా! రావణునిగూర్చి మరియొక అద్భుతమైన కథ కలదు. వినుము. రావణున కెన్నిసార్లు భంగపాట్లు కల్గినను సిగ్గులేదు. ప్రజల బాధించుచునే యుండెను. అత డొక్కనాడు పశ్చిమసముద్రము నున్న వన ములో విహరించుచుండెను. అంత నా సముద్రతీరమున నతనికి పర్వత మొకటి కన్పడినది. అందొక కోనలో ఒక మహాపురుషు డుండెను. అతడు జటాకలాపములో విరాజిల్లుచుండెను అతని ముఖము బ్రహ్మవర్చస్సు, సత్వగుణము ఉట్టిపడుచుండెను. అతని కెదురుగా వెళ్లుసరి కాతని కెన్నో వింతలు కన్పడినవి. ఆ మునికన్నుల నుండి నిప్పుకణములు రాలుచుండెను. శరీరము నుండి స్వేదసంఘము లుప్పతిల్లినవి. అంతలో నత డతిభీకరు డైనాడు. అంత భీకరమూర్తి నాత డెన్నడును చూచియుండ లేదు. అతని కన్నులు మిరుమిట్లుగొల్ప నా రూపము చూచు చున్నంతలో అతడు పరమశాంతుడై కాన్పించెను. ఉరమున

లక్ష్మీదేవియుండెను. దేవగంధర్వాదులు ప్రత్యంగముల నుప్పవించిరి. ఆ వింతలు చూచుచు రావణుడు మహాక్రోధముతో ఉగ్రుడై 'ఓరీ! నీవెవరవో? నా ముందా నీ మాయలు?' అనుచు అస్త్రజాలముల నాతనిపై ప్రయోగించెను. అంత నా ముని 'ఓరీ! దురాత్ముడా! నన్నే కొట్టబూనితివా? చూడుము నా ప్రతాపము' అని ఒక్క గుద్దు గుద్దెను. దానితో రావణుడు క్రుంగిపోయెను. అదెన్ని వజ్రపాతములతో సమానమైనదో అతడూహింపలేకపోయెను. ఆ దెబ్బతోనే మూర్ఛపోయెను అంత రావణుని సేన లతనిమీదికి దుముకబోయిరి. కాని ఒక్క హుంకారముతో వారందరును మూర్ఛపోయిరి. అంత మునియు నెక్కడికో వెడలిపోయెను.

కొంతసేపటికి రావణుడు మూర్ఛదేరి తనవారితో 'ఇతడెవడో? ఎక్కడికో పారిపోయినాడు?' అనగా వారు 'అతడెవడైన నేమి? పిరికిపంద పారిపోయినాడు. పారిపోయినవారిని పట్టి బంధించుట నీ బోటివీరుల ధర్మము కాదు కదా! పోదము' అనిరి. కాని రావణుడు 'అతడెవడో తెలిసికొనువరకు పారిపోయినను వదలుదునా?' అని గుహలోని కేగెను అక్కడ చతుర్భుజులెందరో ద్వారముల కాచుచుండిరి. వారిని చూడగానే కొంచెము భయము వేసినను సంబాళించుకొని ముందునకు సాగెను, అక్కడ నా దివ్యపురుషుడు తెల్లనిశయ్యపై పరుండెను. ఒక దివ్యాంగన అతనిపాదము లొత్తుచున్నది. అతడు ధరించిన చందనమాల్యాదుల పరిమళముతో గుహయంతయు గుప్పుమనుచుండెను. రావణు డా ప్రక్కన పాదము లొత్తు

యువతికేసి రెప్పలవాల్పక చూచుచు దుర్నిరీక్షుడయ్యెను. అవెరిగి దివ్యపురుషుడు లేచి ఒక్క అట్టహాసము చేసెను. దానితో రావణు డదరిపోయి, నిలునద్రొక్కుకొని సవినయముగా చేతులుకట్టి 'మహాత్మా! నీవెవరవు? ఇంద్రునియందు గాని మరియే యితర దివ్యులయందుగాని నాకిట్టి భీకర దృశ్యరూపము కానరాలేదు, నిజమెరిగించుము' అని కోరెను.

అంత నా దివ్యపురుషుడు 'రావణా! నీకిప్పుడు నా రూపము తెలియదు. నీవు బ్రహ్మయిచ్చిన వరములతో ఒడలు తెలియక కొట్టుకొనుచున్నావు. నీకు కాల మాసన్నమగుసరికి నేనే నిన్ను చంపుదును. నే నెవడ నని కదా నీ సంశయము చూడుము.' అని తన దివ్యరూప ప్రదర్శనము చేసెను. అతని నోటిలో, చేతులలో, శరీరములో లోకములన్నియు కన్పడినవి. అతనికి వెయ్యిముఖములు, వెయ్యిచేతులు, వెయ్యికాళ్లు గోచరించినవి. అవన్నియు చూచుసరికి రావణునకు దిగ్భ్రాంతియైనది. అతనికి నమస్కరించి 'నీవంటి దివ్యపురుషుని చేతిలో చచ్చుటకంటె నాకు కావలసినదేమున్నది? అదే నాకు చరితార్థము.' అని పలుకునంతలో ఆ దివ్యపురుషుడు గుహతో సహా అంతర్ధానమయ్యెను. అతడెవరో కాదు. కపిలముని. నీవే. మీ యిద్దరికిని భేద మిసుమంతయును లేదు.' అని ఒక్కసారి అగస్త్యుడు నుతించెను.

శ్రీరాముడు తనువాలికథను చెప్పుమని కోరగా అగస్త్యుడిట్లు చెప్ప నారంభించెను రావణు డట్లా కపిలమునిని చూచి 'ఇతడు శ్రీ మహావిష్ణువే అయియుండును. లేకున్న ఇతని కింత

శక్తి యుండియుండదు.' అనుకొనుచు 'ఇతని తత్త్వమును బ్రహ్మమానసపుత్రుడైన సనత్కుమారు నడిగి తెలిసికొనెదను' అని నిశ్చయించుకొని హిమవత్పర్వతమున కేగెను. అచ్చట తపము చేసికొనుచున్న సనత్కుమారునిచూచి నమస్కరించి 'మహాత్మా! మీకు తెలియని రహస్యములీ జగమున లేవు. అనాదిమధ్యలయుడైన వాడెవ్వడో సెలవిత్తురా?' అని వినయము ట్టిపడునట్లు తత్త్వార్థియై యడిగెను

అంత సనత్కుమారుడు 'రాక్షసశ్రేష్ఠా! ఆదిమధ్యాంతహీనుడై సృష్టిస్థితి విలయకారకుండైన పరబ్రహ్మమే విష్ణు, కృష్ణ, హరి, గోవిందాదినామములతో చెప్పబడును. అతడు శిష్టరక్షణకును దుష్టశిక్షణకును అవతరించుచుండును. అతని కోరిక ప్రకారమే అన్నియు జరుగుచుండును. ఎవరతనిని నిష్కల్మషమైనబుద్ధితో త్రికరణశుద్ధిగా ధ్యానింతురో వారికి ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికము లనెడి తాపత్రయములుండవు.' అని చెప్పుటతో రావణుడు 'మునీంద్రా! అతనిచేతిలో చచ్చిన వారి కేగతిపట్టునో సెలవిండు' అని వేడెను. ఆ మునిశ్రేష్ఠుడు 'రాక్షసేంద్రా! విరోధముతోగాని, మైత్రితోగాని, భక్తితోగాని అతని తలచినవారికి ముక్తి కల్గుట తథ్యము. అతని చేతిలో చచ్చినవారికి దివ్యసౌఖ్యములు కల్గును. అతనితోడి పగకూడ ముక్తిప్రదమే.' అని చెప్పసరి కుబ్బుచు 'మహాత్మా! అతడు నన్నెప్పుడు చంపునో సెలవిత్తురా? 'అనగా అతడు' శ్రీహరి నిన్ను తప్పక చంపును. కృతయుగాంతమున శ్రీరాముడుగా పుట్టి నిన్ను వధించును. దాన నీకు ముక్తికల్గును.' అని చెప్పెను.

అంత రావణు డటనుండి కదలి 'విష్ణు వెవ్వ డవతరించునా ? ఎప్పు డాతనిచేతిలో చచ్చుటతో తనకు ముక్తివచ్చునా !' అని కోరుకొనుచుండెను. దేవతలను బాధించును; మునులను హింసించును. యజ్ఞములను ధ్వంసముచేయును. సత్కార్యముల కన్నిటిని చెరుపును. అట్లు తన దుష్కృత్యములు వెన్నుని చెవిని బడునట్లు చేయదలచి రావణు డెన్నో దుష్కార్యముల చేయు చుండెను.

## శ్వేతద్వీపమున స్త్రీలు రావణు నోడించుట

అంత నొకనాడు నారదుడాతని కగపడెను. రావణు డాతనికి నమస్కరించి 'మునీంద్రా! విశేషములేవైన చెప్పరా!' అని యడిగెను. అతడు రాక్షసరాజు ఎక్కడచూచినను నీ విక్రమచర్యలే కన్పడుచున్నవి. నీయట్టి పరాక్రమశాలి పుట్టబోడు. నీధాటికాగలేక దేవతలు వలసపోవుచున్నారు. అని కీర్తించెను. అది విని రావణుడు మదోద్రగుడై మీస ములు నడిపెట్టుచు 'ఏమీ ? నాపరాక్రమ మంతదైనదా ? నాతో దెబ్బలాడగల్గిన వీరుడెక్కడనైన నున్నాడా ? అనెను. నారదుడు నవ్వుచు లేకేమి ? శ్వేత ద్వీపమున నున్నాడు. అక్కడి వారందరును చతుర్భుజులే. వారందరు సేవించుచుండ శేషశాయియై దివ్యపురుషు డొకడుండును. అతడు నీతో యుద్ధముచేయ సమర్థుడు. అని చెప్పుటతో నారదుని వీడ్కొలిపి మంత్రివర్గమును తీసికొని పుష్పక విమానముపై శ్వేత ద్వీపమునకు బయల్దేరెను. ఇదివర కొకసారి అట్టి పురు

షునిచేతిలో దెబ్బతిన్నను అతనికి బుద్ధి రాలేదు. అసలది జ్ఞాపకమున్నకదా! అతనికి మదాంధతతో లోకమగపడుటలేదు.

శ్వేతద్వీపము దాదాపులకు పోవుసరికి స్థలమాహాత్మ్యము వలన పుష్పకము పెనుగాలికి తిరుగుచున్నది. ప్రహస్తాదులు 'రాక్షసేంద్రా! నేమికరాలేము. మమ్మిక్కడనే వదలుము' అని వేడిరి. వారినక్కడనే దింపి రావణుడొక్కడే నడచి తెలిదీవిలోనికేగెను. అచ్చట నెన్నో ఉద్యాన వనములున్నవి. స్వచ్ఛమైన నీటితో నిండిన సరస్సు లెన్నోయున్నవి. ఒక శృంగారవనములో చెలికత్తెలతో కూడి, ఎంతోమంది దివ్య స్త్రీలు క్రీడించుచుండిరి. వారినిచూచి రావణుడు సంతోషముతో వారి దగ్గరకు పోవుసరికి అందొకతె అతనిని అరచేతిలో పెట్టుకొని 'నీవెవడవు? ఇక్కడకు వచ్చినావు.' అని అడిగెను. ఆ ప్రశ్నతో అతని ధైర్యమంతయు నీరు కారిపోయినది. అయినను ధైర్యము తెచ్చుకొని 'నేను విశ్రవుని కొడుకను. ఇక్కడెవడో వీరుడున్నాడని విని యుద్ధముచేయ వచ్చితిని.' అనుటతో ఆమె కిలకిల నవ్వి చెలికత్తెలతో 'చూచిరటే. వీడట యుద్ధముచేయుటకు వచ్చినాడట. మహాబలశాలి. చేతిలో పట్టిన చేతిలోనికిచాలడు. ఏమి ప్రేలుచున్నాడు!' అనుటతో మరియొకతెవచ్చి అతనిని తనచేతిలో పెట్టుకొని, అటు నిటుకదలనీయక 'ఔరా! ఎంత విచిత్రపు పురుగు వచ్చినది!' అనుచుండగా మరి యొకతె వచ్చి తానుపట్టుకొని, ఓసీ! దీనికి పది తలలు, ఇరువది చేతులుకలవే! ఎంత వింతగా నున్నది! అంతలో మరి యొకతెవచ్చి 'ఇది బూచి. దీనిని

పోనీయకూడదు.' అని పిడికిటలో పట్టుకొని నలుపనారంభించినది. అన్ని బీరములు పల్కిన రావణుడును ఆ అబలల చేతులలో పడి నలిగి ఉక్కిరి బిక్కిరియై బయటపడలేక, వారి చేతులు కరవ నారంభించెను.

అప్పుడామె 'ఇదెక్కడి పురుగే? చేయి కరచుచున్నది. ఇదేమి చెడుపురుగో ?' అని ప్రక్కనున్న చెలికత్తెపై విసరినది ఆమె గట్టిగా పట్టుకొని, 'ఓసి చెడుపురుగా ! మా చెలిని కరచుచుంటివటే' అనుచు కోపముతో సముద్రములోనికి విసరినది.

అంత రావణుడు సముద్రములోపడి కొట్టు మిట్టాడుచు, ఎట్లో బ్రతికి బయటపడి 'నేనిక్కడ నున్న ఆడువారిచేతుల లోనే నలిగిపోయితిని. ఇక మగవారెంత బలవంతులో ? వారి కధిపతియైన విష్ణువెంత బలవంతుడో ?' అనుకొనుచు లంకకు చేరెను. అచ్చటి సామంతులు 'విశేషములేమి?' అని అడిగిరి. అతడు జరిగినదంతయు చెప్పెను. కాని అప్పటికిని సిగ్గుతెచ్చుకొనక 'నే నింతటితో వదలుదునా ? ఆ హరినిపట్టి, చంపి తీరుదును.' అనెను. అది విన్నవారందరును 'పీని కింకను పొగరు తగ్గలేదు.' అరనిని చెప్పి అగస్త్యుడు 'రామా ! ఆ సంగతి యంతయు నీకు తెలియనిదా ? చేయించినవాడవు నీవేకదా ! ఏదో నాచే చెప్పించవలచి తెలియనట్లు 'ఊకొట్టుచున్నావు.' అని శ్రీరాముని పొగడెను.

# హనుమజ్జననము

తరువాత నగస్త్యుడు శ్రీరామునితో 'రామా! ఈ వానర సైన్యమింతలోను నీ యందు భక్తిప్రపత్తులు మిక్కిలి కలవాడు, మహాబలసంపన్నుడును హనుమంతు డొక్కడే. ఇతడు తన బలమును తానెరుగడు. కాని లేకున్న ఇతనికి సాటి యెవరున్నారు?' అనుటతో రాముడు 'అవును. ఇతని మూల మునసే నాకు సుగ్రీవునితో సఖ్యము కుదిరినది. యుద్ధరంగ మున మూర్ఛిల్లిన లక్ష్మణుడు సజీవుడైనాడు.' అని పొగడి ఇతని జన్మవృత్తాంత మెరిగింపుమని వేడెను. అంత అగస్త్యుడు ఇట్లు చెప్ప నారంభించెను.

'కేసరి' యను వానరేంద్రుడున్నాడు. అతడు మహా బలశాలి. అతని మేనమామ కుంజరుడు. అతడు తనకూతురిని 'అంజన' యను దానిని కేసరికిచ్చి పెండ్లి చేసెను. అత డామెతో అత్యంతానురాగముతో కొన్నియేండ్లు కాపురము చేసెను. కాని సంతానము కల్గలేదు. అందుచే అంజనాదేవి విచారించుచుండ 'వాయుదేవుని సేవించి కోరిక నెరవేర్చు కొనుము'ని భార్యను నియోగించెను. ఆమె వాయుదేవుని గూర్చి తపమాచరించినది. అతడు తనయందు గుప్తమై యున్న ఈశ్వరతేజము నామె కొసగెను. అంత నామె గర్భ వతియై ఒకయేడాది గర్భము దాల్చినది. అంత నొక్క శుభ

ముహూర్తమున సుపుత్రుని కన్నది. ఆ బాలునికి పుట్టుకతోనే యజ్ఞోపవీతములు, కంకణములు వచ్చినవి.

అత డాకలితో ఏడ్వజొచ్చెను. ఆమెకుమారుని ముద్దాడి 'మా నాయనే. నీకు కావలసినన్ని పండ్లు తెత్తును, వాపోవకుము' అని పరుండబెట్టి పండ్లకై అడవికేగినది. అంతలో సూర్యోదయమైనది. సూర్యబింబము ఎర్రనిపండువలె హనుమంతునికి కానవచ్చినది. 'ఇక్కడ ఇంత మంచి పండుండగా మరొక దానికై వెదకికొనుటయేల ?' అని దానిపై కెగిరెను. ఆ ఎగురు నప్పుడు కలిగిన గాలి విసురునకు దేవగంధర్వాదులు తల్లడిల్లిరి. ఇతడెవడో ? అని నివ్వెరపడి చూచుచుండిరి, ఇంతలో రాహువు సూర్యునిపట్టుటకై వచ్చుచుండెను. హనుమంతుడు ముందుగానే సూర్యుని పట్టుటకై వచ్చుచుండెను. హనుమంతుడు ముందుగానే సూర్యుని మ్రింగివేసెను. సూర్యుడు వాయుసుతు డను గౌరవముతో చల్లపడి అతనికి బాధలేకుండునట్లు చేసెను. అయినను నునువెచ్చగా నున్నది. ఇంతలో రాహువగపడగానే అతడు సూర్యుని వదలి రాహువును మ్రింగబోయెను. తాను సూర్యుని మ్రింగుటకై రాగా తన్నే మ్రింగ వచ్చిన యీ గ్రహమెవ్వరో అర్థముకాక, భయపడి, రాహువు తన బాధను ఇంద్రునివద్ద కేగి చెప్పుకొనెను.

అంత నింద్రుడు 'నేనా క్రొత్తగ్రహమును మరలించి నీకు సూర్యగ్రహణమును కల్పింతునని ఐరావతముపై వచ్చెను.

హనుమంతుడంత నైరావతమును చూచి 'ఇది చాల పెద్దదిగా నున్నది. ఆకలి తీరునని దానిని మ్రింగబోయెను. అది వెనుకకు తిరిగి పారిపోబోయెను. అంత ఇంద్రునకేమి చేయవలెనో తోచక వజ్రాయుధముతో ఆ బాలుని కొట్టెను. ఆ బాలుడు వజ్రాయుధపు దెబ్బ తాళగలడా? పర్వతముల రెక్కలు త్రుంచిన దా ఆయుధము. పిచ్చుకపై బ్రహ్మాస్త్రముగా ఇంద్రుడు ప్రయోగించినాడు. మరొక్కడైనను మంచినీరడుగకుండ 'హరి' అనవలసినదే. కాని అతడు గట్టిపిండము కనుక నేలపైబడి మూర్ఛపోయెను.

ఆ వార్త తెలిసి వాయువు తన ప్రాణమూర్తి నుపసంహరించుకొనెను. అంత జగత్తంతయు చిత్రపటమువలె నాగిపోయినది. కదలిక లేదు. ఈయుపద్రవము చూచి దేవతలందరును బ్రహ్మవద్దకేగి విన్నవించుకొనిరి. అతడు యోచించి 'ఇంద్రుడు చేసినది దురాగతము. వాయుతనూజుని చంటిపిల్లవాడని సంకోచింపక వజ్రముతో కొట్టినాడు. దానికి కోపించి వాయువు పర్వతగుహలో దాగినాడు. ఇప్పుడతని బ్రతిమాలుటయే కర్తవ్యము' అని దేవతలతో కలిసి గుహావద్దకు వచ్చి వాయుదేవుని కేకవేసెను. అతడు బ్రహ్మవచ్చినట్లు తెలిసికొని తన బాలుని తెచ్చి అతనిముందు పారవేసెను. అంత ధాత అతని యొడలు నిమిరెను. వెంటనే అతడు లేచెను. ఇతనికి బ్రహ్మాస్త్రమువలన చావు కల్గదు. రెండుఘడియలసేపు మాత్రము

తెలివితప్పునని వరమిచ్చెను. శివుడు పాశుపతాది రౌద్రాస్త్రములనీతడు బాధనందడనియు, ఇంద్రుడు ఇతనికి వజ్రము బాధకము గాదనియు, సూర్యుడు 'నా తేజస్సులో నితనికి శతాంశమిచ్చితిని, విద్యల నిత్తుననియు 'అందరు నన్నిరకములైన వరముల నిచ్చిరి. అప్పుడు సంతోషించి వాయువు యథాప్రకారము సంచరింప నారంభించెను. అప్పుడు జగత్తు సజీవమైనది. దేవతలందరును స్వస్థానముల కేగిరి.

ఇతడు వరగర్వితుడై మునీశ్వరుల పర్ణశాలలపైబడి కోతిచేష్టల చేయదొడగెను. ఆ అల్లరి భరింపజాలక మునులాతనిని 'నీబలమునీకు తెలియకుండుగాక!' యని శపించిరి. దానితో అతడు చిన్నపనినైనను ఒకరు చెప్పినగాని చేయనేరడు. అప్పటికితనికి పశ్చాత్తాపము వచ్చినది. దుడుకుపనులు మానినాడు. సూర్యుడు వరములిచ్చునపుడు విద్యలిత్తునన్న మాట జ్ఞాపకమువచ్చి సూర్యునివద్దకేగి, అతని రథముతో సమముగా నడచుచు విద్యలన్నియు నేర్చెను. మాశిష్యులు తిని కూర్చుండియే విద్యలు నేర్చుకొనుట కశ్రద్ధ కలిగియుండ, నితడు పరువెత్తుచు విద్యలనేర్చెను. ఆవేగము సూర్యవరప్రసాదలబ్ధము. తరువాత నితడు సూర్యునిమాటపై సుగ్రీవునిచేరి, కొలుచుచుండెను. ఇతడున్నాడనియే వాలికి భయము. కాని ఇతడజ్ఞాత పరాక్రముడగుటచే వాలిమీదికి చేయిచేసికొనలేదు. అంత ప్రభావశాలి యితడు' అని చెప్పుసరికి, రాముడు 'వాలి సుగ్రీవుల జన్మ క్రమమెరిగింపుము' అనెను.

# వాలి సుగ్రీవుల జన్మము

అంత అగస్త్యుడిట్లు చెప్పదొడగెను. పూర్వము మేరు పర్వతముపై బ్రహ్మదేవుడు తపస్సమాధిలో నుండెను. ఒకప్పుడతని కన్నులనుండి మరందబిందువులు జారినవి. వాటిని చేతితో తుడవగా 'ఋక్షవిరజు'డను వానరవీరుడు పుట్టెను. అతనిని తనకు పండ్లుతెమ్మని నియోగించెను. అతడట్లు ప్రతిదినమును ఫలపుష్పములకోసి బ్రహ్మకిచ్చుచు, తాను తినుచుండెను. అంతనొక్కనాడాతడొక సరస్సులో స్నానమునకై దిగగా ఆడుదియైపోయెను. అప్పుడు విహారమునకై బయలుదేరిన ఇంద్రసూర్యులామెనుచూచి వలచిరి. వారికోరికతో అతనికి కంఠమునుండి 'సుగ్రీవుడను, తోకనుండి వాలియు' పుట్టిరి. ఆపుత్రులను తీసికొని మరునాడు బ్రహ్మవద్దకేగెను. అప్పటికతడు మగవాడయ్యెను. అతడు తనకు జరిగినదంతయు చెప్పి దానికి కారణమడిగెను.

బ్రహ్మ ఆలోచించి 'ఇక్కడొకప్పుడు పార్వతి జలక్రీడలాడుటకై చెలులతో వచ్చినది. అంత రాక్షసులు కొందరువచ్చి నీటిలోదిగి అల్లరిచేయబోగా 'ఇందు దిగినవారందరు స్త్రీలగుదురని శపించినది. నేనదివిని ఆమెను శాపమును కొంతసడలింపుమని వేడగా 'ఆమె అందుమునిగిన మగవానికి ఆడురూపమొక్కనాడుండును' అని సెలవిచ్చినది. అందుచే నీ కొక్క

రోజు మాత్రమాడుసూపు వచ్చినది.' అని చెప్పి 'నీవు విచార పడక విశ్వకర్మ నిర్మించిన కిష్కింధను పాలించుకొనుము' అని పంపెను. అతడట్లే తానున్నన్నినాళ్ళు కిష్కింధనేలి, వార్ధక్యమున వాలిని రాజుగా చేసెను. తరువాత కథ నీవెరిగినదే. ఈ పుణ్యకథ నెవరుచదువుదురో, ఎవరువిందురో వారికి భోగ భాగ్య సమృద్ధికల్గి సంపదలు తామరతంపరలగును.' అని చెప్పి అగస్త్యుడును, తక్కిన మునులును శ్రీరామునివద్ద సెలవుతీసికొని తమయాశ్రమముల కేగిరి. శ్రీరాముడును సాయంసమయ మగుటచే సంధ్యావందనాద్యనుష్ఠానములు నిర్వర్తించుకొనుటకై లోనికేగెను.

